

శ్రీ సద్గురుభ్యోనమః

# గురూపదేశ మార్గము

శ్రీ కైకాడి దేశికేంద్ర ప్రభువుల వారి ప్రియ శిష్యులైన శ్రీ సద్గురు ఆనందయ్యగారలు రచియించిన గ్రంథము

ఇతి శ్రీ సమిష్ఠి బోధానంద ఉప్పలంచి కృష్ణమూర్తార్యులు షోడశీ విలక్షణ స్వాములు వారి ప్రియ శిష్యులు శ్రీ కరుణానంద చింతకింది సంతోషాచల రాజయోగి చేత ఈ గ్రంథమును అర్చీవ్.ఆర్గనైజేషన్ నందు సంతోషుల వారి పుత్రుడు మరియు శిష్యుడు శ్రీ చింతకింది జగదీష్ గౌడశర్మ గారి చేత అప్ లోడ్ చేయబడింది.

## గణపతి ప్రార్థన శంకరాభరణం

గజ ముఖా గానవినోదభరా । జ్ఞానసుధాసాగరా విఘ్నేశ్వరా ॥గ ॥

నానారీతుల నవవిధభక్తుల । నారాదించితినీ వేదవిలక్షణ ।

విమల దళేక్షణ । కోమలదేహివనీ నా మదియందున నమ్మి భజించితి ।

ప్రేమగ । బ్రోతువనీ । నిక్కవంబు గనుదిక్కునీవెయని । మ్రొక్కితి పెంపెక్కితి ।

దిక్కులెల్ల ధ్వని పిక్కటిల్లగను చక్కనయ్య చనుదెంచరా । నెనసుంచరా గ॥

హరిహర సన్నుత అఖిల జగన్నుత । దురిత గుణంబులు బోదోలా ।

బిరబిర రమ్మని బిలచితి మిమ్ముల మరియాలస్యం బికయేలా ।

గరళ కంఠ సూనుడవీవూ । ఘనసిద్ధుల పురినీతా వు ।

మరి నా పిలుపును విని నీవు । త్వరగను దయజూపి ననుబ్రోవూ

॥ గజముఖా ॥

## తత్వము -1 ఆటతాళం

బెదుర బోకురచిన్నివాడా । పిచ్చిముదిరీన కుక్కాలు వదురూటగని నీవు ॥బె॥

బెదుర బోకుర భువిబుధులానుదర్శింప । వదుగురు నినుజూచి ।

పరిహసించినగాని ॥బె॥

పెద్దాల సేవింపగాను । లజ్జ । వద్దూర యని నీకు ముద్దూగ దెలపీతి॥

పెద్దాల సేవింపబుద్ధిబుట్టుట పూర్వసిద్ధిగావలెనంటి యుద్దార లోపాల ॥బె॥

మమత లోపల జిక్కినీవు యేల శ్రమ జెందెదవు । వట్టి భ్రమలందులావూ ॥

॥ మ ॥

మమతాను విడనాడి । మనసు నిలిపి తినేని ।

క్రమమూతొమరు జన్మగలుగా బోదిక నీకు ॥ బె ॥

చొక్కటి నీ సాధమందూ । దుష్టరక్కాసులార్గురు నక్కియున్నరు జూడు ॥ చ॥

నక్కీన దుష్టాల తిక్కాణగించేతీ గ్రక్కూన మోక్షంబు । దక్కూనిజంబూగ ॥ బె॥

ధరణిలోపల శిద్ధులూరు దాసాదాసుడవైతెయా । పురమందుజేరూ ॥ ద"

శిరమొంచి దేశిక వరులాను సేవించి ।

త్వరితంబుగను దేహతత్వాముగనుటాకు ॥బెదు॥

# ✓ తత్వము - 3 ఆటతాళం

మాయ జగమును నమ్మబోకండీ । నరులార పెద్దల మాటపైనీ మనసు నిలుపండీ।
రేయి బవలన కుంద నిత్యము రేచకము పూరకము నిలపియు । పాయకను
భ్రూమధ్యమందున । ప్రభలు జిమ్మెటి ప్రభను గాంచుడి ॥ మాయ ॥

మూడుయేరుల మూలమెరుగండీ । యవిదాటగలగిన వాడె నిజమగు
త్యాగధనుడండీ। మూడుయేరులు దాటె మార్గము ముద్దును గలనేక మూర్ఖులు।
పాడుజన్మము లెత్తుచును భువి । పాపులై జీవింపు చుండిరీ॥ ॥ మాయ ॥

బాధగురువుల బోధ వినకండీ । మీమనసుసనన్ గల వేదవారలు బాపలేరండీ ।
పాదుగను సజ్జనుల రీతిగ పలుకులెన్నియో బలికి పైసకు వేద సారము నమ్మజూతురు
వెర్రివారల వెంటదగిలియు ॥ మాయ ॥

రామనామము స్మరణజేయండీ । స్మరియించె సూత్రము రాజగురువుల చేత
దెలియండీ। కామక్రోధములన్ని వదలియు తాము మనసును నిలుపగలిగితె। యీ
మహిలోనిజమైన సౌఖ్యమ । యింపుగా లభియింపు నిజముగ ॥ మాయ॥

బ్రతుకు దెరువుకు బాధపడకండీ । సద్బుధులు నడచిన బాటలో
పయనించవలెనండీ । హితవుగను వేదార్థములు యేక్షితిలో ప్రభలగ జేసిరుషులు।
ప్రతిఫలంబిమ్మనుచు యెవరిని బ్రతిమిలాడగలేదు వారలు ॥ మాయ ॥

దాసులను గనిదరికి జేరండీ। అన్యాయమని యెటి దారి వెంబడి తమరు బోకండీ।
వాసిగను శ్రీ శిద్దులూరిలొ దాసుడగుయానందయాఖ్యుడు । భాసురంబగు యీ
ప్రబోదము। జేసె నిత్యము, ధ్యాస నుంచుక ॥ మాయ ॥

## తత్వము -4 ఏకతాళం

అహర్నిశలు శ్రీ హరి నామంబును। ఆత్మలో నిలుపుము రోరన్నా।
అహంకారమును అంటక నుండిన। అవనిలో జన్మించుట సున్నా ॥ అ ॥

సంసారంబనె సాగరమున బడి। సతమతమొందకురోరన్నా।
హింసలు జేయుచు మాంసభక్షణము। మానుటె మనవ్రత మనుచున్నా ॥ అ ॥

పదవి మధంబుచె నెగురుచు ప్రజలను। వెధలపాలుజేయకున్నా।
పదవియూడగనె ప్రజలు నిన్నుగని। పలుకరించబోరని విన్నా ॥ అ ॥

ధనధాన్యంబులు దండిగ గలవని దలుపకు మనసున వోరన్నా।
తనవు వీడి నీవు దరలెటి వేళ్ళలో ధనమును గొనిపోవుటసున్నా॥ ॥ అ ॥

ధరణిలో శిద్దుల పురి యానందయ। పరమ విద్య నెరగుట కన్నా।
కరుణగల్ల కైకాడి దేశికుల। శరణుజొచ్చెననగను విన్నా॥ ॥ అ ॥

## తత్వము - 5 ఆటతాళం

అందమైన కొలనులోపల హంసయాడుచున్నదీ।
మందబుద్ధల కెల్ల దాని మరుగు దెలియాకున్నదీ ॥ అంద ॥

జోడు దివ్వెల నడుమ చక్కటి జ్యోతి వెలుగుచున్నదీ
మూడు గుణముల కెల్ల తానే మూలమై గూర్చున్నదీ ॥ అంద ॥

కోరికల మయమైన కొంపలో కొలువు జేయుచున్నదీ।
ఆరు మూడును విడువనట్టి వారికందక యున్నదీ ॥ అంద ॥

భ్రాంతిగలదనె భావమును యా బ్రహ్మమెరుగాకున్నదీ।
భ్రాంతిలోపల జిక్కిమనసు బయలు గనుగొనకున్నదీ ॥ అంద ॥

యేటికీ యెదురీదనేర్చియు యెరుక మరువుమన్నదీ।
యెరుదాటి యెరుకవిడచితెయేమిలేకనె యున్నదీ ॥ అంద ॥

ధరణి శిద్ధుల పురము నందున స్థిరముగా నిలచున్నదీ।
నిరతము యానందయాఖ్యుడు నిశ్చలుండైగన్నదీ ॥ అంద ॥

## తత్వము - 6 ఏకతాళము

సందులు గొందులు దిరిగెతె దొరుకదు। సద్గురు కృప యీ మూర్ఖులకూ।
పొందుగ బ్రహ్మానందము గోరితె। పొవలె పెద్దజేరుటకు ॥ సందు ॥

మంది మార్భలము మరిధన రాసులు మాయని దేలియదు మధంజులకూ।
బంధకములోబడిబహుశ్రమనొదుచు। భక్తి యెదెలియదు బదిరులకు॥ సందు॥

యిల్లు భూములును యిల్లాలు నుంగని। యిది సుఖమని యెటి హీనులకూ॥
ఓల్లు ముదిరితలవణికిన విడువదు। వసుధలో భ్రమ దురోవ్యసనులకూ
॥ సందు ॥

అంతనాదియని గంతులు వేయుచు సంతసించు సన్యాసులకూ।
మంతనమున గురుచింతనజేసెటి।మార్గమె దెలియదు మంధులకూ ॥ సం॥

నిరతము సిద్ధుల పురమున వెలసిన।నిజగురు గొలిబెటి దాసులకూ।
ధురితగుణంబులుదొలగియు సుఖములు। దూరముగావుర భక్తులకూ ॥సం॥

## తత్వము - 7 ఆటతాళం

వేదావేదాంగంబులెరుకే। చెవులా నాదంబు వినుటాయు యెరుకే నాదుబిందు
కళా। నామరూపములెరుకె। పాదుగ తన పంచప్రాణంబులను యెరుకే
॥వేదా॥

భగవంతుడను మాట యెరుకే। నతని భజనజేయుట గూడ యెరుకే।
జగతిలోపల మంత్ర జపతపములు యెరుకె। అగణితముగ మహిమలన్ని
జూపుట యెరుకే॥ ॥వేదా॥

మూడు లోకములన్న దెరుకే యింక ముమ్మూర్తులను మాట యెరుకే
యిడాపింగళమనెటి నాడిమదలమెరుకే ।
వేడుకతో నదులు గూడు స్థావరమెరుకె ॥ వేదా ॥

పాపపుణ్యములన్నదెరుకే । వాటి ఫలితంబులను బొందుటెరుకే ।
ఓపికతో పవన మాపియుంచుట యెరుకె। చూపులో చీత్కాళ జాడ గోరుట యెరుకె
॥ వేదా ॥

పంచకోషములన్న దెరుకే। తత్వ। పంచాకమును జేయుటెరుకే। సంచితార్థములనెటి
సకల కర్మములెరుకె । మంజీగజీవాతమరుగు దెలియుట యెరుకే ॥ వేదా ॥

ఆరుచక్రములన్నదెరుకే । వాటి । దారిజూచుట గూడయెరుకే । సారెకు సోహంబు।
స్మరణ జేయుట యెరుకే । ధారుణి తపసూలధ్యాన్న ముద్రలు యెరుకే
॥వేదా॥

శిద్ధాల పురియనుటయెరుకే । కాయా సిద్ధి బొందుట కూడయెరుకే ।
ముద్దాగ్రైకాడిమునిదేవుడెరుకాను । వద్దనుంచకు మాని బుద్ధి జెప్పినదెరుకే ॥
॥వేదా ॥

## తత్వము - 8 ఏకతాళం

శివ శివయని భజియించూ । నీ చిత్తము నిలకడయుంచూ ।
శివ శివయని భజియించెటివారికి । భవములంటవని బాగుగదెలిపితి
ఆరుమూడిటిలో జిక్కి । నన్నుంటలేవుగదపక్కి ।
ఆరు మూడిటిని హతమొనరించితె। మేరు పర్వతంబెక్కితీరెదవూ ॥ శి ॥

దండిమాయ నెగజిమ్మో । యది యెండ మావియని నమ్మో కొండగుహలో
గూర్చుండి యాశలను । ఖండనజేయక కలుగదు మోక్షము ॥ శి॥

ఏనమిది గాదెల జూచీ । నీవెగసిపడకురా కాసీ ఎనమిది గాదెల
నెగురు వేయకను । తనువులో ఆత్మను కనుగొనజాలవు ॥ శివ ॥

శిద్ధులూరి పురమందూ । బహుశ్రద్ధ వహించి యు ముందూ ।
అద్దము వలె నీ అంతరంగమును । శుద్ధిజేయుటకు పెద్దలజేరియు ॥ శివ ॥

(మనసా శ్రీహరిని విలువా వమ్మా అనుమాదిరి)

## 9. తత్వము - అటతాళం

1. మనసా సద్గురునీ మరువకమ్మా । మదియందుకొమ్మా ॥ మ ॥
తనుమనధనములు తనకర్పించియు । వినుతిజేయుపాదము విడకుండను

2. కంపూ సంసార మందుజిక్కీ । గోసెగను జెక్కి ॥ కం ॥
సంపదని జమనిచాలమురియుచును ।
రొంపిలో దిగి రోధింతువు తెలియక ॥ మ ॥

3. లేరూ గరుసాటీ వారలెందూ । లెంకంగ నిందూ ॥ లే ॥
సారెకు సద్గురుస్మరణజేయునీ। గోరపాపములు దూరముబోవును ॥ మ ॥

4. తారాతమ్యంబుమరచి నీవూ । తరకంబులాడా ॥ తా ॥
తగునా పెద్దాలజేరిలావు । ధారుణిలోపల ధర్మసూత్రములు ।
కోరివినవు దుష్కారి కలలోబడి ॥ మ ॥

5. కరుణా సాగరుడైన వాడూ।కైకాడి గురుడూ ॥ ॥ క ॥
ధరణిలో సిద్దులపురి ఆనందయ్య।ధురితజాలములు దూరముజేసెను ॥ మ॥

## 10. తత్వము

హంపదమందున జిక్కి నరులు । సాహంబనెతత్వము దెలియరుగా । సంపద నిజమని భ్రమసి సజ్జనుల సాంగత్యంబును వొప్పరుగా ॥ ఆరువర్గములాయందు బొరలుచును । హంకారంబును వీడరుగా । క్రూర కృత్యములు జేయుటమానియు । కూర్మిగకలజీవింపరుగా ॥ ॥ హంపద ॥

పరమభక్తులను గాంచి దుర్జనులు । పరిహాసంబులు జేతురుగా ।
శరణుజొచ్చియును గురుచరణంబులు । సేవజేయుటను దెలియరుగా ॥
పుడిమి లోపలను పుణ్యపు పనులకు । విడువరు ధనమును । విభుదులుగా ।
పడుపువృత్తిగల పడుచుల కొరకై । పైసను వ్యయమొనరింతురుగా ॥హం ॥

ధరణిలో సిద్ధుల పురమున నిలచిన । దాసులగని దరిజేరరుగా ।
కరుణగల్లకైకాడిదేశికుల । శరణుజొచ్చి వరమడుగరుగా ॥ హం ॥

## 11. తత్వము

### (శ్రీశైలం శివమయం అనుమాదిరి )

యీలోకం మాయలోకం । యిందు నరులకు యుంది శోకం ।
సాలోకమె సకల సౌఖ్యం సాధుజనులకు నదియెముఖ్యం ॥ యీ ॥

తనువు ధనములు తనవియనుచును । తగువిధుల భ్రమలొందుచును భువి ।
జననమెత్తుచు మరియు గిట్టుచు । జనులు శ్రమలను జెందుచుందురు.
॥ యీ ॥

మేడలు మిద్దెలను భూములు । మేధిని సమకూర్చి మురయుచు ।
మూఢతనముచె ముందుకొచ్చెటి । కీడుదెలియని పాడుజనులకు ॥ యీ ॥

దండిదాతలచెంతజేరియు । దానధర్మములివ్వకుండగ । కొండెములు
జెప్పుచును బీదల । మండెకడుపులో । మట్టిబోతురు ॥ యీ ॥

మంతనంబున చింతజేయరు । మంచిమాటలు మానవులు భువి ।
పంతములు పట్టింపులన్నను । పరవశింతురు ఫలితమెరుగక ॥ యీ ॥

సత్యవంతుల మాటలెప్పుడు । సాగన్వీరు సభలయందున ।
నిత్యము యా సత్యమాడెటి । మర్త్యులకె । యిదిమంచిలోకము ॥ యీ ॥

ధరణిశిద్ధులపురమునందున । దాసుడై యానందయాఖ్యుడు ।
గురు కటాక్షము బొంది సత్యము । తరచి చూచిన మురికి లోకం ॥ ॥ యీ ॥

## 12. తత్వము - నామము ఏకతాళం

గురుకీలెరిగియు నడువు ! నీధురిత గుణంబులు విడువు !
గురుకీలెరిగియు యెరుకను బాసితె । మరుజన్మంబనె మాటయె లేదిక ॥గు॥

రేపుమాపుయనుటేలా ! గురుప్రాపుగోరుటకు బాలా । రేపు మాపనుచు ।
వోపికదపి:తె ప్రాపకం పంకిలము పాలై పోదువు ॥ గు ॥

కామక్రోధములు విడచీ । భువికాంక్షలనెల్లను దుడచీ । స్వామి నామమును।
స్మరణజేసితివ । నీ మనోరథము నికనెరవేరును ॥ గు ॥

ధరశిద్ధుల పురమండీ । గురుధ్యాన్నములోపల నుంచీ । మరిచెను
దేహము మరియానందయ్య సరియగు భక్తిచె । స్థిరచిత్తుండై ॥ గు ॥

## 13. తత్వము ఆది తాళము

చాలయా సంసారమిక మనకేలయా । అలుపిల్లలను పాలించుటకై ।
వేలుగడింతువు వెతలను బడుచును । తొలుముడుతబడి నేలగూలగనె ।
జాలిని జూపరు ఆలును పిల్లలు ॥ చాలయా ॥

యేరయా । నీశ్రమలు దీర్చెటి వారయా । ఘోర వ్యాధులలో దూరి కృషింపుచు।
ధారుణీ పీడియు దరలు సమయమున । కోరి చుట్టములు కొనకు స్నేహితులు ।
రారు నిన్ను మరి రక్షణ జేయగ ॥ చాలయా ॥

కాదయా । మీ తనువు నీదనరాదయా । పాడుగ కాలుడు పాశమువైచియు । యీ
ధర జీవునీ యీడ్చుక వెళ్ళగ । భాదలుబడుచును బయలు దేరెదవు ।
నీదనె దేహము నిచటనె విడచియు ॥ చాలయా ॥

చూడయా । గురుదేవుడే నీ తోడయా । మూడు దేహముల మూలమెరంగియూ।
పాడువాంఛలను పారదోలుమని । నాడు బలికె మరి నమ్మకయుండిన ।
బోది జన్మములు బొందక తప్పదు ॥ చాలయా ॥

రావయా । సద్గురుని సేవకులేవయా । రావయా రాద్ధాంతమేటికి ।
రాగద్వేషములన్ని వదలియు । సావధానముగ శిద్ధులూరి పురిస్వామిని
జేరగ సంశయ మేటికి ॥ దా॥

## 14. తత్వము - జంపెతాళం

దేవుడు మానవరూపములో దేహము గొనెయీ లోకములో ।
కావున మనజుడె కరుణామయుడై జీవులపై దయజూపుచుండవలె సత్యవంతులై యీ
మహిబుట్టియుసామరజనులను । ప్రేమతో బ్రోచియు పేరుగాంచిరిల ॥ దే ॥

దయగలవారిలో ధర్మరాజుగను । ధాతల యందున దానకర్ణునిగ । నియమము దప్పని
నీతి మందులలో । నయముగ బుద్ధుని నాకారంబున ॥ దే ॥

జగతిలో నానకు జైనుని రీతిగ । సుగుణములందను సూయ విధంబుగ । పగయె
యెరుంగని ప్రహ్లాదుని గను । తగు విధములయ యా బ్రహ్మము తాతగ ॥ దే ॥

సాదులయందున స్వామి వేమనగ । బాధలు దీర్పగ బసవేశ్వరునిగ । మోదము
తోడుత యీ ధరయందున । ఆది శంకరుల యవతారంబున ॥ దే ॥

ఘనముగ భువిలో గాంధి తాతగ । జనప్రియుడగు మన జవహరులాలుగ ।
దినకరతేజుడు దీరుడు శాస్త్రిగ । జనియించెను యీ జగతి వెలయగను ॥ దే ॥

సుందరుడౌ సుభాసు చెంద్రునిగ । పొందుగ వినురాజేంద్ర ప్రసాదుగ
అందముగను మన యిందిర మాతగ । రందిలేని రాజీవుగాందిగను ॥ దే ॥

దరణిలో బాలగంగాధరునిగ । హరిజనులందున అంబేత్కరునిగ । పరమశాంతులో ।
గురువలయందున కరుణగల్ల కైకాడి గురువుగను ॥ దే ॥

మతబోధకులలో మహ్మదు యేసుగ । హితవుగ భక్తుల యందు విదురునిగ ।
పతివ్రతలందున పాండవ పత్నిగ శృతులు వ్రాయుటలా చూడ వ్యాసునిగ॥ దే ॥

యుగయుగంబులలో భగవంతుడు యీ జగతిలో నరుడై జన్మంబెత్తుచు ।
తగువిధముల భువి తాడితప్రజలకు దిగు బాపెమరి దివ్యపురుషుడై ॥ దే ॥

నిరతము సిద్ధుల పురమున నుండెటి। నరులందున యానందయమాదిరి। విరివిగ దాసులు యీ జగమందున। మరిమరి బుట్టిరి మంచిగ వినుడిక ॥దే॥

## 15. తత్వము

వదులనయ్య నినువో మహాత్మమది గందురగయీ జన్మ విధము జెప్పెటి దాక ॥వ॥

కదులనయ్య నాకలతలు దీర్చగ। కాదని నోటితో కఠినము లాడిన। పదుగురునను గని పరిహసించినను। యిదియేమని నను హీనము జేసిన ॥ వదు ॥

యేలబుట్టె యీ యెరుకయు బాగుగ। మూలము లేకను ముద్దుగ యీ భువి। వాలాయంబుగ వసుధలో యెరుకను। దొలెటి మార్గము దోచక మరి మీ। పాలబడితి పసిబాలుని రీతిగ జాలి జూపి నన్నేలెటి దొరవని ॥ వదు ॥

సర్వజ్ఞుడవని చాలగ నమ్మితి। దుర్వ్యసనుడవని దూరక గొప్పగ సర్వవిధంబుల। సంశయమంతయు। సమయజేయగల సామర్థుడవని। మరువకుండగను। మదిలో దంచితి దురువిధి దెలియక। దుఃఖితుండనై। ॥ వదు ॥

గట్టిగమాయచె। కట్టుబడియు మీ। గుట్టుదెలియనే నిట్టి జగంబున।

యెట్టులైనను। బట్టిన మాయను। మట్టుబెట్టగల మహనీయుడవని। పట్టువిడక మీ పాదములందితి యిట్టి మాయబోగొట్టె ధాతవని ॥ వదుల ॥

వదురుబోతువలె వదురుచు పెద్దగ। విధిగా కాలము వృథగావించితి। తుదకు నా గతిని। తూచి చూచుకొని। పదపడి శిద్ధుల పొరిని వీడియు। యిదెవచ్చితిమి। సదనము జేరగ కదలనివ్వకైకాడి దేసికుల ॥ వదుల ॥

## 16. తత్వము ఏకతాళం

వట్టిది రాయి సంసారం। దీన్నొదులుక దొరుకదు గురుసారం। పట్టువిడక ప్రాపంచము జేసిన తుట్టతుదకు నిను తూతూయందురు ॥ వట్టిది ॥

భార్యపిల్లలను జూచుకొని । భువి భారము తలపై వేసుకొని కార్యము తోడుత
కలిజీవింపుచు । అర్యుల జేరవు అహంకారివై ॥ వట్టిది ॥

మందిని నిదలు జేయుచునూ । పరభామల పొందునుగోరుచునూ । సందులు
గొందులు చాలదిరిగెదవు । ముందీకు వచ్చెటి ముప్పను దెలియక॥ వట్టిది ॥

సుందరమగు శిద్ధులపురము। ఘనశుభము లొసంగెటి స్థావరము । అందునగల
గురుమందిర మెగినీ । బంధములుడిగితె బయలైయుందువు ॥ వట్టిది ॥

## 19. తత్వము ఆటతాళం

1. కారణ నరజన్మడే గురుడు । కరుణ సాగరహృదయుడే । గురుడూ ।
భారమౌ సంసార బాధలన్నియు బాప । మారువేశముతోడ మహికి వచ్చినవాడు
॥ కారణ॥

2. కామిత ఫలదాయుడే గురుడూ। ఖర్మనియత దూరుడే గురుడూ । భూమిలోపల
చిత్త బుద్ధిహంకారంబు । యేమిలేకుండాగ యెగుర జమ్మిన వాడు ॥ కా ॥

3. దీనజనోద్ధారుడే గురుడూ । దివ్యమంగళ రూపుడె గురుడూ ॥ మానుగయీ
దేహమర్మమెల్లనుదెలియా । జ్ఞానము బోదించుగౌరవనీయుండు ॥ ॥ కా ॥

4. మృదువగు పరిభాషుడే గురుడూ । మునికులజెన పోషుడే గురుడూ ।
సదమలహృదయుండు । సద్గుణభరితుండు । ముదముతొభక్తుల హృదయ
నివాసుండు ॥ కారణ ॥

5. శుద్ధ నిర్గుణ రూపుడే గురుడూ । శుభములిచ్చెటి దేవుడే గురుడూ ।
నిద్ధామయ్యినబోధముద్దాగ బోధించు । సిద్ధినొందగజేసె సిద్ధులపురిలోన॥ కా॥

## 18. తత్వము - జుల్వతాళం

దేశకేంద్రులను గలువూ నీ దేహ భ్రాంతినిక విడువూ ।
వాసిగ గురు ఉపదేశము బొందియు । ఆశలనెల్లను నాశమొనర్చియు ॥దేశ॥

సుఖదు:ఖంబులు రెండూ అవి చూచి చలింపక యుండు । సుఖదు:ఖంబులు
నికరము గావని । ప్రకటించెనయా । పరమాత్ముండౌ ॥ దేశి ॥

యెరుకను విడువకయున్నా । గురుమరుగుదెలియలేవన్నా । యెరుకతోడ
గురుమరుగం దెలుసుకొని । మరియాయెరుకను తరిమి గొట్టుచును ॥ దేశి ॥

జ్ఞానమె ముక్తికి త్రోవా ! అజ్ఞానమె చీకటి జీవా । జ్ఞానా జ్ఞానము
కావలనుండెటి మానుగ శ్రీ గురుమందిర మేగియు ॥ దేశి ॥

కలసిద్ధుల పురమందూ । నీకాంక్షలుదుడువుము ముందూ ।
కలిసిద్ధులపురి నిలయము నందున । చలనముడిగినిశ్చలతత్వంబున ॥ దేశి॥

## 19. తత్వము - ఆటతాళం

యేమి జేయుదునూ, యీ మన సూనుయెట్లు నిలుపుదనూ ,
కామక్రోధములందు కాంక్షబెంచుక గురునీ ।
నామమంత్రము దలువ నా మాట వినకుండె ॥ యేమి ॥

పరిపూర్ణభావం జెప్పిన విడుదూ । సిరపైన మోహం ।
మరియాదగను యిట్టి । మాయలోపల నీవు । తిరగూట తగదాని
తిట్టి చెప్పిన వినదు ॥ యేమి ॥

అంతేమిలేదూ । ఆశలపైనా బ్రాంతీని విడదూ ।
వింత వింతలు గల్లా విషయాభోగవలాకై । గంతులేయుచునన్నూ ।
చింతాల పాలుజేయు ॥ ॥ యేమి ॥

అచలంబులోనా । నిలువగదిరుగూ । నది అహము తోనా ।
వచనరచనలు మాని । వాదగియుండక । దేశా
రచనలల్లుచు గొప్ప । రందిలోబడుచుండు ॥ ॥ యేమి ॥

భూమిలోపలనూ శిద్ధుల పౌరిధామమందుననూ । స్వామి సద్గురు
పూజ సలుపుదమన్నను । కోమాలి వినకుండ కోతిరీతిగ దిరుగూ ॥యేమి ॥

## 20 తత్వము - జంపె తాళము

కూడవలెనాయ్యా సజ్జన సంఘమూ । కూడియును ప్రతినిత్యనోట పాడవలెనయా ప్రార్థన గీతమూ । మూడు గుణముల మూలమెరిగియు । పాడువాంచల పారదోలియు । యేడు మేడలు యెక్కి సద్గురు జాడ గనుటకు నేడు భక్తులు ॥ కూడ॥

చపల ముడిగియు త్రిపుటి నెరగియు । కపటమొదలియు కాంక్షవీడియు । వుపకరంబౌతపసులందరు । వూహకందని తావు జేరగ ॥ కూడ ॥

ఆశపాశములన్ని రోసియు । అమితమగు కోర్కెలను గోసియు । వేశభాషలనన్ని ద్రోసియు । దాసులందరు ధరణి యందున ॥ కూడ ॥

వాదబేధములన్ని వదలియు । వాసనాత్రయములను వీడియు పాదుగను గురు పాదమందగ పరమపావనులైన భక్తులు ॥ కూడ ॥

ధరణి సిద్ధుల పురము నుండెటి । దాసులందరు దప్పకుండగ । కరుణగలకైకాడి గురువుల కడకు జేరియుకలతబాయగ ॥ కూడ ॥

## 21. తత్వము - జుల్వా తాళం

దేవుడు శిలలందు లేడూ । నీదు దేహమదున గలడు చూడూ । దేవుడు నివసించు తావుదెలియలేక । పోవుచుందురు రాళ్ళసేవ జేయగ గుడికి ॥ దేవుడు ॥

యాత్రలు దిరుగంగనీవూ । యేలయాత నలను బడియెదావూ । నేత్ర ద్వయము నందు నెలమితో వెలుగొందు। సూత్రధారుని విడచి క్షేత్రాలు బోనేల ॥ దే ॥

జగతిలోపల గొప్పగానూ । నీవు జడము పైయ్యిన భ్రాంతితో నూ । సాగను బడుచుదేహ శోధన జేయాక । అగుపించ బోడుయా భగవంతుడిక మీకు ॥దే॥

అహమందున జిక్కినీవూ । కేవలాత్మను గనుగొనలేవూ । సహాసివై నీవు అహంబు నణచీతె । దేహమందున నీకు దేవుడగను పించు ॥ దే ॥

ధరణిలోపల శిద్ధులూరు । దాసాదాసుడానందయ్య గారూ । నిరతంబుకై కాడి గురువుల సేవించి । పరబయలులోపల స్థిరచిత్తుడైయుండె ॥ దే ॥

## 22. తత్వము - ఆట

### నీవైన దయజూడవమ్మా మాదిరి

మనసు నిలిపెటి మార్గమేదీ । నాకు విదెల్పు గురుదేవా యిట్టియు పాదీ । పనిబూని దానిని పట్టియుంచుదమన్న । క్షణమైన నిలువాదు చేయు దెట్టుల నేనూ ॥ మ॥

నిమిషమొక్కత నిలువకుండా । చాలదుముకులాడుచునుండు దూబారిముండా । రమణీయమగు మణులు రాజ్యభోగములాపై భ్రమ వీడకున్నాది బ్రతిమిలాడినగాని ॥ మనసు ॥

మూడింటిపై ప్రేమ తోనూ । నన్నూ పాడుకూపము నందు పడదొబ్బితానూ । కూడుగుడ్డలకయ్యొ క్రూర మయ్యినపనులు । వేడుకతో జేయా వెపన మొందుచు నుండూ ॥ మనసు ॥

చమరీ మృగము రీతి బెదురూ । యెంతజెప్పిన నిలువాక చెడుతోవ కరుగూ । తమరి నామము నోట । దలుప గొలపక నన్నూ । శ్రమలు బెట్టుచు నుండె చంచాల మతియయ్యొ ॥ మనసు ॥

పరమ పావనులైన వారూ । యిట్టి ధరలొ పండరి పూరి ధాములు మీరూ । మరియు శిద్ధుల పొరి మనుజుడనై నీదు శరణుజొచ్చితి దాని । చపలత్వమును బాప ॥ మనసు ॥

## 23. తత్వము - ఆదీ

మానవ జన్మంబన్నాయీ మహి ప్రాణులలో మిన్నా ॥ మా ॥
కాని ఫలంబేమున్నది నిజమును । గానలేడు మధగర్వంబునబడి ॥

ధనమును గూర్చుటకయ్యొ । చెడుపనులు జేయు భువివెయ్యొ వినయము తోడుత విభుదుల జేరియు । తనుకడతేరెటి తత్వ మెరుంగడు ॥ మానవ ॥

ఇహ సుఖములు మదినమ్మీ । మరి విడువడు ఆహమును పమ్మీ ॥ ఇ॥

సహజముగను యీ సంసారముకై బహుశ్రమ జేయును బాధలు యనకను ॥ మా

లేనిపోని భ్రమలందూ । యెనలేని దు:ఖములు బొందూ ॥ తానెవ్వరో యీ
నెవ్వరొయని । జ్ఞానమెరుంగడుమా మాతృడు ॥ మా

బంధువర్గమును జూచీ । యిది భలమని మనసుకు దోచీ । పొందు గపరులను
నిందలు జేసితె । అందుకు యమునిచె తిందువు తన్నులు ॥ మా

సిద్ధులూరి పురమందూ । బహు । బుద్ధిగ నడచుకొముందూ ॥ గ్రద్ధరి చేష్టలు
ముద్దుగ మానియు । శ్రద్ధగ గురువులసేవయొనర్పుడి ॥ మానవ ॥

## 24. తత్వము - ఆటతాళం

వచ్చెటప్పుడు నీదు వెంటా । యేమి । గొని వచ్చితివి రోరి ఖంరా ॥
వచ్చిన తదుపారి వయసు బెరగియు నీవు ।
మచ్చకంతుల గూడిమమతాలోబడితీవి ॥ వచ్చె ॥

పిచ్చిలోకమునందు నీవూ । పరులుమెచ్చి పొగడెదరంచు లావూ । యిచ్చావచ్చి
రీతి ఇండ్లు మేడలు గట్టీ । ముచ్చాటదీరకా ముందే బోదువుగదురా ॥ వచ్చె ॥

తుచ్ఛా సంసారంబు జూచీ । కొండముచ్చు రీతిగ గంతులేసీ ॥
హెచ్చూగ జగమందు హేయమయ్యిన పనులు ।
నచ్చీజేసియు తుదకు లుచ్చావైతివి గదురా ॥ వచ్చె ॥

లక్షాలార్జింపగ నీవూ । ప్రజలు మెచ్చాని పనిజేసెదావూ । తుచ్ఛావై పిల్లి
బిచ్చామెయ్యక యున్న । వచ్చినట్లు లెనంతవదలి పోదువు గదురా ॥ వచ్చె ॥

సచ్చెరిత్రము గల్ల ఊరూ । బుద్ధులూ మెచ్చి నిలచిన శిద్ధులూరూ । స్వచ్ఛామైయ్యీ
భక్తులొచ్చి పోదురు నిత్యా, పచ్చావిల్తునివైరి పాదసేవలు జేయా ॥ వచ్చె ॥

## 25. తత్వము - జుల్వా తాళం

సర్వమతంబుల సారం। సర్వేశుని గొలసె ప్రచారం ॥ స ॥
దురువెసడుడవై దూరకు ఇతరుల।
సర్వజనులు మన సమమని దెలుసుకో ॥స॥

త్రోవలు వేరైయున్నా। తనుబోవు స్తలమెుకటన్నా। కావున నరులీ భావన
దెలియక। ఏవగించెదరు। ఆవలి త్రోవల ॥ రూపాయని హిందువులు। మరి
రూబూలు యని రష్యనులూ। యేపుగ బలికెటి యావస్తువునకును।
రూపమొకటెగద చూపులోగనుటకు ॥ స ॥

మనుజులంత ఒకటనుచూ। తన మనమున దలపరు తరచూ। వనమున కొంగలు
వకటై యుండగ। మనుజులకేలనో మహిలో ఈర్ష్యలు ॥ స ॥

గొప్ప మతము నాదనుచు। భువి మెప్పులు బులకుచు తరచూ। దెప్పి పొడవకీ
దేహము బెంచెటి।పప్పులు బియ్యము పండ్లేమతమువి ॥ స ॥

స్వార్థము విడువని వారూ। యీ సంగతి దెలియగలేరూ। పూర్తిగ శిద్ధుల
పురివాసులు నిజవర్తనులై యీ అర్థమెరుంగుడి ॥ ॥ సర్వ ॥

## 26. తత్వము

జీవ నీ ముక్తికి త్రోవ జూపెటి గురుదేవుని రమ్మానవే। సద్భావుని రమ్మానవే।
భావంబు లోపాల। భక్తి తోడుతనేనూ। కేవలాత్మండాని సేవజేయగనుంటీ
॥ జీవా ॥

అందంబుగను భక్త బృందంబులను గూడ పొందుగరమ్మానవే।
దుడుకు పోకడలను మానవే। సందేహమేటికి బంధంబులను దృంచి।
తొందరగను తానమందిరమును జేర్ప ॥ జీవ ॥

పంచదశిని గుణియించుట దెలియాక పంచానపాలైతినే ।
యెరుక నొంచజాలక నుంటినే । మంచిగపాడాశిమర్మంబుగనలేక ।
చెంచాల మతినైతిచేయు దెట్టుల నేనూ ॥ జీవా ॥

ఇంతిరో ద్వాదశి కంతుదొరకక నేనూ చింతాల పాలైతినే ।
నావంతుకేమని ఏడ్తునే । మంతనమందున పంతంబుమానియు ।
దంతిగమన నాకు దారిజూయించాగ ॥ జీవా ॥

దరణి లోపల నాకు మరియేమి దొవాక శరణుజేయుచునుంటినే ।
నన్ను దరిజేర్చరమ్మంటినే । సిరిలోలుకు చుండేటి శిద్ధాల
పురిలోన పరితపించుచునుంటి పరబయలు గనలేక ॥ జీవా ॥

## 27. తత్వము

దయజూపియును గురుదేవా। నాదూ । దావంతములు బాపరావా ।
దయజూపినన్నేలే । దాతావనుచు నమ్మీ ।
ప్రియమూగ బిలచీతి నయమైన నా స్వామి ॥ దయ ॥

ఇహ సౌఖ్యములు నమ్మినేనూ । బుద్ధీ । హీనుండనై గొప్ప గానూ । అహమందు
జిక్కి అలుపిల్లలతోడ । సహజీవనము జేయసంసారమున బడితి ॥ దయ॥

కూటికై తెలివీగ నేనూ । భువి । కూడాని పనిజేయుచూనూ। నోటితో మిమ్మూల
నొకమారుదులవాక । ఘూటైన శ్రమలాచె కలత జెందుచునుంటీ ॥ దయ॥

నీచుండాననియెంచబోకూ । చెయ్యి జాచితి గదనయ్యా నీకూ ।
వాచాలుడని మదిలో । యోచాన శాయకా ।
సూచాన జేసీయు గాచి రక్షింపాగా ॥ దయ ॥

పరమపావన దివ్యరూపా । నన్నూ । పాలించు సుగుణ ప్రతాపా ।
ధరలొ శిద్ధుల పారిదాసుడానందయ్య । నిరతంబు భజయించె
నీ పాదయుగళంబు ॥ దయ ॥

## 28. తత్వము

నరుడావై జన్మించి నందుకూ । నీతి నియమాలు పాటించవెందుకూ ।
నరుడావై జన్మించి ధరలోన జీవుల బరిమార్చిమాంసంబు భక్షింపభావ్యబా ॥న॥

నీవు జగతిన బుట్టినందుకూ । మరి । నిత్యానిత్యము లెరుగ వెందుకూ ।
నిత్యాయనిత్యములాకు వెత్యాసము గాంచి ।
అత్యాష పరుడావై ఆరాటపడబోకూ ॥ నరుడ ॥

భోగంబుగని సంతసించకూ । నిజ । బోధకులను వెక్కిరించకూ ।
భోగంబుగని మురిసే । భోక్తా లెందరొతుదకు ఆ గంబుపాలైరి ।
అవనిలో వినరయ్యా ॥నరుడ॥
మహనీయులను జేరెటందుకూ । మంచి । సహావాసమును జేయవెందుకూ ।
ఇహమాత్ర అర్థాలఫల బోగ రహితంబు । మహిలోన దెలసూక । మమకారమును
వీడు ॥నరుడ ॥

శిద్ధులూరిలో బుట్టినదుకూ । మోహా । బద్ధుడవై యుండుటెందుకూ ।
శ్రద్ధా గగురుపాద సేవజేసియు బోధ । ముద్దాగవడసీయు ।
ముక్తి బొందుటెమేలు ॥ నరుడా ॥

## 29. తత్వము

లేరామంద విచారా । మాలోచన జేయకు మూరా ॥ యా ॥ ॥ లేర ॥
గురుని కడజేరి నిజపదవి దారిగనుటకై దర్పము వీడియు ॥ లే ॥

దుశ్చరితంబులు వీడి । మహా । నిశ్చలితులజత గూడీ । నిశ్చయముగ
మధమచ్చరమొదలియు । సచ్చరితుని గని సన్నుతిజేయగ ॥ లేరా ॥

జనులు మెచ్చజగమూపీ । నీ । ఘనతపరులకును జూపీ । కొనకు ముసలివై
కొలచేతగొని । వణకుచు దిరగినా । ఒక్కరు మెచ్చరు ॥లేరా॥

అనుమానించుటయేలా । నీ । వతనిని జేరగచాలా । అనుమానింపుచు దినములు గడిపిచె పనిగొనియమపురి పాలై పోదువు ॥లేరా॥

కలిశిద్ధుల పురమందూ । కైకాడి గురువులను ముందూ । తెలివిగనందయ గొలచియు నిత్యము । చలనము బాసెటి ఫలమును బొందెను॥లేరా॥

## 30. తత్వము

విధిదప్పకుండా । వినుచౌలనిండా । మధమత్సరమ్ములన్నీ మదినుంచకుండా । వి సదాకనుల నిండా । సర్వేశుడుండా । మది నిలిపి జూడనట్టీ మనుజుండెరండా ॥విధి ।

పదివిడువకున్నా అది గనుటసున్నా । పదివిడచి నట్టివాడే ఫలతాంశుడన్నా । యిది దెలియకున్నా । యిలాజెదుదువన్నా । వ్యధలన్ని మాని నిజము । వెతకూటెమిన్నా ॥ విధి ।

హృదయంబులోనూ । పదిలంబు గానూ । వదులాక దలువు నిత్యా ఓంకారమూనూ ముదమొప్పగానూ । ముక్తీకిబోను । యిదే మార్గమంటి మీతో విహితంబుగానూ ॥విధి ।

సమాదృష్టిగలిగీ । భ్రమలన్ని యుడగీ । తమదేహ తత్వమెల్ల । తరచండి చెలగీ క్షమాగుణమెరగీ శ్రమయనక తిరగీ । రహనీయమైన రాజయోగూల మరగీ ॥విధి ।

దాసూల గలసీ । దర్పంబు విడచీ । భాసూరముగ గురు నీపాదాలు గొలచీ ఆశానుడుడచీ । అహమూను నణచీ । దేశికులాను జేరు దేహంబు మరచీ ॥ విధి ।

పరాపదవి దారీ । పదవోయి తూరీ । పరితాప మందు జిక్క ఫలమేమి కోరీ । ధ శిద్ధుల్లూరీ । ధామూనిజేరీ । స్మరియంచు మంటినిత్యాస్థిర పదవి కోరీ ॥విధి॥ స్థిరపదవి కోరీ ॥ విధి ॥

## 31. తత్వము ఏకతాళం

యెంతజేసీన సంసారమింతేనయా । అంతులేనట్టి శ్రమకాలవాలామయా । అంతముండాదయా। ఆశవీడదయా। చింతబెంచూచు మది బిచ్చూ బెట్టూ నయా

॥ యెం ॥

లక్షలార్జించినను లాభమేమిటయా। పిచ్చిభ్రమకాని పితుకైన గొనిపోవయా। వచ్చి నట్లేనయా। వదలి పోదువయా। తుచ్చఖర్మాలె నీ వెంటవచ్చూ నయా ॥యెం॥

మురికి దేహంబుగని చాలమురువాకయా। చెరగిపోయిన పైసాకు చెల్లాదయా। వురుకులాడకయా। వుత్తదానికయా। మత్తు వదలీతె భ్రమలన్ని చితానయా

॥ యెం ॥

యెన్ని జన్మంబులెత్తీన సుఖమేదయా। మున్నూ జేసీన ఖర్మాలు ముసరూనయా। నిన్నువదులావయా। నిజముదెలియావయా। తన్నుతాగంటె మరుజన్మనున్నొనయా

॥యెం ॥

శిద్ధులూరిలో యిసుద్ధి దెలియవయా। బుద్ధీ దెలసీయు గురువూల గలువావయా। శ్రద్ధతోడనయా। సేవజేయవయా నిద్ధమయ్యాన మీ బోధవిడువాకయా ॥యెంత॥

## 32. తత్వము భలె మంచిరోజు మాదిరి

నిజామైన బోధ నిడచీతెబాధా। నిదానించి వింటే లేదు వేదా ॥ ఆ ॥ నిజ ॥

అందమైన యి గురోబోధ । అంధలేక యమునిచె బాధా । అందుకొరకె శ్రీ గురుబోధా। అందినీవు నీవు సుఖపడరాదా । ముందు నీకు మూగియున్నా । బంధజాలములు బాపగలేవా ॥

పాలువెన్న గలసిన రీతి। నీలో వుంది జీవనజ్యోతి। కాలమంత గడిపెటి జాతి। యేల బొందు దైవ విభూతి। కల్లబొల్లి మాటలన్ని చెల్లజాలవని చెప్పితి నీతి ॥ నిజా ॥

పట్టువీడవలదుర బాలా। పట్టినట్టి భ్రమలను దోల। యిట్టి గుట్టు దెలియక నేలా। పట్టి భ్రమలు జెందుట యేలా । పుట్టు గిట్టులేని విద్యా। గుట్టుదెలియగురు జేరవదేలా ।। నిజా ॥

యింపుగాని సంసారం। పంపునోయి ముక్తికి దూరం। కంపు గొట్టు కలి వ్యవహారం। కాలమంత విడని విచారం గొప్పగొప్ప ఆశలన్నీ। కుప్పకుప్పలై। లేపుదుమారం ॥ నిజా ॥

వద్దు నీకు ఇ వ్యవహారం। ఏద్దురీతి మోయకు భారం। బుద్ధి విడచి తిరుగుటె నేరం। ముద్దుఆను విడచి విచారం। జిద్దు రద్దిలేని బోధ। సిద్ధులూరిలో వినసింగారం ॥నిజా।

## 33. తత్వము

మానరా హింసామానరా। హోరోరి నరుడా ॥ మానరా హిం ॥

మానరా మహాజ్ఞానివై। సంప్రాణికోటికి హానిజేయుట। జ్ఞాన హీనుల లక్షణంబని। ఘనముగా యేచించి బాగుగ ॥ మానరా ॥

నోటిరుచికై యితర జీవుల ఘాటుగా శిక్షించబూనుట । పాటిగాదని పలికితిని నామాట నమ్మిమి నేటికైనను ॥ మా ॥

మనసుతోనీ మాటతోనీ। మరియు కాయముచేత గాని। అనువుగను విను ఇతర తనువుకు హానిజేయుట నదియు పాపము॥ మానరా ॥

దారుశిల ప్రతిమలను బెట్టి దండిదైవంబనుచు మ్రొక్కి కోరిమేకల కోళ్ళబట్టి। కోయుటా ధర్మంబుగాదిక ॥మాన ॥

హంసలక్షణ మెరుగలేకను। హింసజేతురుహీనజనులు।
మాంసబక్షణమానుమనియును। మౌనులెందరో మనకు జెప్పిరి ॥ మానరా ॥

సుందరం బగు శిద్ధులూరిలో। పొందుగను యానందయాఖ్యుడు। ముందుహింసను మానుమనుచును। వందనంబులు జేసి పలికెను ॥ మానరా ॥

## 34. తత్వము

చిత్తా వృత్తుల నణచకున్నా । మోక్షమేత్తారి సాధింతువన్నా । చిత్తావృత్తులనణచె । సత్తాయెలేకున్నా । రిత్తా భ్రాంతులు మదికి హత్తూక చెడెదావు ॥ చిత్తా ॥

కొండగుహలల్లో గూరుచున్నా । నిన్నూ । పిండిజేయక మానదన్నా । దండీగ దానిలో దాగియున్నటువంటి । వండూనుగడుగాక వైరాగ్య మబ్బాదు ॥చిత్తా ॥

నిమిషా నిమిషము దానిలోనూ । బుట్టూ అమితామయిన కోర్కెలూనూ । క్రమమూతో జగమందు । కండ్లజూచిన దంతా తమకుగావలెనంచు శ్రమలుబెట్టుచునుండూ ॥చిత్తా ॥

ఆశలన్నియు రేపుచుండూ । మోహపాపంబులలో దోయు చుండూ । దీశాలివైదానీ. దోషంబులన్నీయు ।గాసినొందించినఘనత దక్కును నుమ్మీ ॥ చిత్తా ॥

భోగ భాగ్యములందు భ్రాంతి । భుపి ।బోదోలుటయె మంచి యోగా శిద్ధాంతి । రాగద్వేశములన్నీ । రహితంబు జేయాక । బాగా శిద్దుల పురిలో బయలు జూడగ లేవు ॥ చిత్తా ॥

## 35. తత్వము

మోజుగను మీరంత వినరండీ । దెలపితిని మరియా రాజ యోగమె శ్రేష్ఠ మౌనండీ। భూజనులు సంసార సుఖములు భూరిగను యనుభవముజేసుక । జితంబుగ గురినిజేరియు రాకపోకడ దెలసుకొండిక ॥ మోజు ॥

సతుల సుతులను విడువబోకండీ । సకాలత్మబంధులు సతతమని మరియాద జేయండీ । బ్రతుకు నాళ్ళ యీ విధము దెలసుక । వెదలనొందకు వెర్రితనముచె। జతనముగ వీరెవరు ముందర గతిని దీర్పగ ప్రతిన బూనరు ॥ మోజు ॥

సకల వ్యాపారములు జేయండీ । గృహములను మేడలు సాధ్యమైనారీతి గట్టండీ। ప్రకటితంబుగ మీరలిట్టి । పనులు జేసియు ఫలము జూచుక । నికరలాబము లేదనుచు । మరి నిజము దెలసిన సుజనులొాదురు ॥ మోజు ॥

దేశదేశములన్నియేలండీ। దేవేంద్ర వైభవ। ఆశపాశములన్ని జూడండీ। వేశములు మార్చుకను ప్రజల। మోసమొందగజేసి తుదకు। దోషమును గ్రహించి సద్గురు దాసుడౌటుకు దారిజూచుకో ॥ మో ॥

దరణి లోపల శిద్ధులూరండీ। యానందయాఖ్యుడు దండిగా వచ్చి యుంచె వినరండీ। పరమభక్తులైన వారి పలుకులందున గల రహస్యము। త్వరగ దెలుసుక నడువనేర్చిన। తమరు ధన్యులటంటి నిక్కము ॥ మోజా ॥

## 36. తత్వము

బయలు బ్రహ్మమని బలికిరి పెద్దలు। భక్తుడ వినరా నామాటా। స్వయముగ మరియా బయలులో నుంటె। బలుకవు నోటా అయె టా ॥ బయలు ॥

అట్టిదిట్టిదని యన రాకున్నది। పట్టు విడక విను నా మాటా। గట్టిగ సద్గురు గుట్టు దెలుపకను బట్టలేవు నీవా బాటా ॥ బయలు ॥

రాకడ పోకడ లేకనె యున్నది। ఏక కాలమున ప్రతిచోటా। తేకువ తోడవి వేకుడవైతె। నీకు వశం బౌయిా పూటా ॥ బయలు ॥

కాయముపై భ్రమ। గలిగితె యెన్నడు। గాంచలేవు నివాబాటా। దాయకదెలిపితి। సిద్ధుల పురిలో దాసులకెల్లను యిా మాటా ॥ బయలు ॥

## 37 తత్వము

ఉన్నదీ బయలైయున్నదీ। ఓరోరి అంతట యున్నదీ పరబయలన్నదీ ॥ ఉన్నదీ సద్గురుని కృపచే। కన్నవారలకెన్న రాకను। పన్నుగా బ్రహ్మాండమంతట। ఉన్నదీ యది సున్నగాకను ॥ ఉన్నదీ ॥

సత్తుచిత్తులు రెండుగాకను। తత్తరంబులు తమలోలేకను। యెత్తు పల్లములందు యనకను। యెందు జాచిన సందులేకను ॥ యున్నదీ ॥

రూపురేఖలు యేమిలేకను। తాపసులు గన తరముగా కను। పాప పుణ్యములంట బోకను। పరగతత్వం బదియుగాకను ॥ ఉన్న ॥

పుట్టుగిట్టుట పుడమిలేకను । పురుషుడు ప్రకృతియుగాకను । గట్టిగను తనలోన బయటా । చెట్టురీతిగ చలనమెరుగక ॥ యున్నదీ ॥

పంచముద్రల ఫలము దెలియక । ప్రాణమయ కోశముల కంటక । మంచిదెశ్శల మాటనెరుగక । మానసంబుకు మరియుదోచక ॥

యమము నియమము లెరుగలేకను । భ్రమలకది మూలంబు గాకను । తమకు తామె స్వతః సిద్ధిగ । అమరులకు గనయలవిగాకను ॥

యెరుక మరుపులు రెండు లేకను । తురుకహిందూమతముగా కను నరక స్వర్గపు ఫలితమెరుగక ' నాది మద్యాంతములు ఏకను ॥ యున్నదీ ॥

ధరణి శిద్ధుల పురములోపల । దాసుడగయానందయాఖ్యుడు ధురిత గుణములు వీడి సద్గురు । దరికిజేరిన యెరుక దెలియక ॥ యున్నదీ ॥

## 38. తత్వము

వెలుగుచున్నది పరంజ్యోతి । దాని వెలుగు జూచితె యింక కదులాడు కోతి ॥వె॥

కలమేల్కలందున కడకు శుషుప్తిలో తొలుకు లేకుండాగ నిలచి వెన్నెలరీతి ॥ వెలుగు ॥

కాటుక కనుమూలనడుమా । త్రికూటంబుపై దాని చోటుంది వినుమా ॥ కా ॥

వాటంబుగను గురు సూటిని మదియందు । నాటీన వారికి తేటా తెల్లబయ్యి ॥ ॥వెలుగు ॥

జోడు పక్షుల జతగూడి । దాని జాడకెగితె బోపు పాపాలు వీడి ॥జో ॥

వేడూకతో అయిదు మేడాలపైకెగసి । ఆడూచునున్నాది అగ్నేయమందున ॥ వె॥

పంచరంగుల ప్రమిదలోన యది । పదహారు కళలాను ప్రసరించు జాణా । మంచీగ శ్రద్ధ వహించీయు మనసందుచెంచాలముడ గియు గాంచీతె కదులాక ॥వె॥

ధరణిలో శ్రీ శిద్దులూరు । భక్తవరదుడా నందయ్య బలికె యీ తీరు ।7 యెరుక మరుపులు రెండు । యెగురా గొట్టియు దాని । సరసాకు జనిచూడ । చాలచోద్యము తోడ ॥ వెలుగు ॥

## 39. తత్వము

యేమిజేయుదునూ । యీ యోహంబు యెట్లు వీడుదునూ । కామక్రోధము లాపై ప్రేమ బెంచుక నేను । రామనామము మరచీ । రంధీపాలైపోతి ॥యేమి॥

దారా పుత్రులనూ । సతమని మదిలో దలచి బాగుగనూ జారావని తరీతి । జగమెల్లా దిరుగూచు । కోరిశ్రీ గురుజేరే దారిగానక యుంటి ॥ యేమి ॥

మూఢచిత్తుడనూ । ముందటి ఖర్మా । వీడజాలకనూ । తాడూను గనిమదిలో । త్రాచుపామని నమ్మి । పాడు బ్రాంతి చె భూమి పతనామై చెడిపోతి ॥ యేమి॥

నావంటివాడూ యీ జగమందు । యేవంకలేడూ । వావి వరుసలు మరచి । వయ్యారులతో గలసి । కావరంబు చెమంచి । త్రోవగానక యుంటీ ॥ యేమి ॥

దేహంబునమ్మీ । నిత్యంబూను దెలియాక నుమ్మీ ఆహంబులోపాల । అంతనాదనుచును । ఊహజేయుచు నుంటి । వృత్త బ్రాంతిలో జిక్కి ॥ యేమి॥

ధరణిలోపలనూ సిద్దుల పొరి దాసుండనేనూ । మరువాక కైకాడి గురువూల జేరిన । విరివీగ మోహంబు విడిపోక యున్నాది ॥ యేమి ॥

## 40 తత్వము

వినరా మానవ గురునీ ఘనమైన బోదా ॥ వి ॥
వినకుంటె విడువాదు మరు జన్మబాధా ॥ వినరా ॥

విషయ వాంఛ నెల్లా । విడనాడకున్నా । ఝషమురీతిగ వలలో జిక్కేదవన్నా ॥ వినరా ॥

సీతాతాపంబూలు । స్థిరముగావన్నా ॥ సీ ॥
వీతారాగంబూలు విడుచూటె మిన్నా ॥ వినరా ॥

పంచామలముల యందు । పడిపొరలుచున్నా ॥ పం ॥
చెంచాలమతివయ్యా । చెడిపోదువన్నా ॥ ॥ వినరా ॥

యీషణత్రయమూలు । విడువాకయున్నా ॥ యీ ॥
దోషాభ్రాంతులనెట్లు । దోలెదవన్నా ॥ వినరా ॥

ధరణి శిద్ధుపోరీ । ధామూని గన్నా ॥ ధ ॥
తిరిగి యీ జగమందు । మరిబుట్టావన్నా ॥ వినరా ॥

## 41. తత్వము

### (బృందావనమది అందరిది అనుమాదిరి)

అరును యెనమిది యేరియు గలపితె । యెంచితె ప్రంద్రెండౌను గదా । నేరుపు తోడుత మీరలు దీనిని యెరగితె యేమియు లేదు గదా ॥ అరును ॥

పంద్రెంటిలో నైదును గలిపితె । పంచదశై భువిప్రభలు గదా । దండిగ దీనిని దరచితె జన్మకు దారియె లేకను పోవు గదా ॥ అరును ॥

పదియును నెనమిది గలపియు గూడితె ముదముతొ పదహారౌను గదా సదయల మతులీ । సంఖ్య నెరంగి తె । స్వప్న జగత్తని తోచుగదా ॥ అరును ॥

నాల్గుటి చేతను । నాల్గు గుణించగ । నాల్గు నాల్గులై తేలుగదా । నాల్గు నాల్గులైనవి సరిపోయిన । నంతట వెలుగై వెలిసె గదా ॥ అరును ॥

సంతసముగ వేదాంతము నంతయు యింతటితో సరిపోయె గదా । అంతరమున దీనర్థ మెరంగితె । ఆత్మకు చింతయె లేదు గదా ॥ అరును ॥

గట్టిగ దీనికి గణితము దెలసితె పుట్టుట గిట్టుట లేదు గదా । పట్టుగ శిద్ధుల పొరిలో మరియీ । గుట్టంతయు విడిపోయె గదా ॥ అరును ॥

## 42. తత్వము

### (వల్లని రాజ అనుపాట మాదిరి)

కుళ్ళును పీడక కుదురాదు యోగం । యూకుళ్ళంత గడుగూదె నిజమైన త్యాగ ॥నిజ ॥ తొల్లిజేసిన పాపాల । తోడూతను । మళ్ళి వచ్చితి ఏక నీవు మహిజేరనూ కల్లగాదు విను కపట ముండాకను । నీవుల్లంబు రంజిల్ల మెల్లంగను ॥ కు॥

అరు వర్గాలు దూరంబు నుండాకను । ఘోర సంసార జల దీనిదాటకనూ । దారుణ లోననూ దవసులయ్యినా ద్యాన్సధారణ లెన్నియు జేసినమా ॥ ఓ ॥ కు ॥

తలకుమించిన తత్వాలు జదివీననూ । నిలకాడలేని మనసూను నిలుపాకనూ చిలుక రీతిగనూ । పలుకులా బలికిననూ । యోగఫలమబ్బ బోదెంత ఘనులైననూ ॥ కుళ్ళునూ ॥
ఓ.....

చిత్తమేవేళ్ళనొకచోట నుండాకను । అత్తుకున్నట్టి అహమూను ద్రుంచాకనూ మత్త లోపాలను । మాయదాటాకనూ । సత్తుచిత్తాల మర్మంబు దెలసీననూ ॥ఓ.....

॥కు॥

మతమూలాపైన మమకార మొదులాకను బ్రతుకు దెరువూకు వ్రతమూలు జేసినను హితవు తోడూతనూ । శృతులు జదివీననూ । క్షితిని శ్రీ శిద్దులవారికి పతివైననూ ॥ ఓ.. ॥కుళ్ళు ॥

## 43. తత్వము

1. అక్కడిక్కడ దిరుగబోకమ్మా వో మనస జగమున । వెక్కిరింత పాలుగాకమ్మా అక్కడిక్కడ దిరుగవలదని । పెక్కువిధముల నొక్కి చెప్పిన తిక్కబుద్దులు మానకున్నవ దిక్కుమాలిన కుక్క రీతిగ ॥ అక్కడిక్కడ ॥

2. యెందుదిరిగిన యేమిలేదమ్మా । వో మనసనీకూ । యెంత జెప్పిన బుద్ధి రాదమ్మా యెందు దిరిగిన యేమి లేదని । ముందు నీ మదియందు దెలియక । రందిలోబడి గుందుచుందువు మందమతి వైమరులు నొందుదు ॥ అక్కడిక్కడ ॥

3. రాజయోగులతోడగలువమ్మా। వో మనసఖులులతో। రాయబారము జేయరాదమ్మా। రాజయోగుల తోడగలసి విరాగివై విషయాదులన్నియూ । పూజ జేసితె తిరిగి జగమున । పుట్టబోవని పట్టి జెప్పితి ॥ అక్కడిక్కడ ॥

4. సత్తుచిత్తుల సంగతెరుగమ్మా। వో మనసమొహాము। మత్తు లోపల మునిగి చెడకమ్మా। సత్తుచిత్తుల సంగతెరుగక। వుత్తభారము నెత్తి నేసుక। పెత్తనంబులు జేయుచుందువు। పేరుకొరకై పెనుగులాడుచు ॥ ॥ అక్కడిక్కడ ॥

5. పాతకులగని పంచజెనకమ్మా। వో మనస క్రూరుల చేత స్నేహము చేయబోకమ్మా। పాతకులగని పంచజేరితె । ఘాతుకంబులు గలుగ జేతురు । స్వాతిశయమును విడచి భక్తుల । సరసకేగితె సౌఖ్యమబ్బును. ॥ అక్కడిక్క ॥

6. మందబుద్ధులు మానవే మమ్మా । వో మనసలోకమునందు మాయలో మునిగి చెడకమ్మా । మందబుద్ధులు మాపజాలక। బంధములోబడి బాధనొందుచు। ముందుగతులను తెలియకున్నవు । సుందరం బగు శిద్దులూరి లో ॥అక్కడిక్కడ॥

## 44. తత్వము

### (వినవె సఖి తెలిపెదను పరమ రహస్యం అనుమాదిరి )

1. వినవె సఖీ । మనసు నిలిపి । మాయరహస్యం । అది కనుల ముందు నిలిచి జేయుచున్నది హాస్యం । నఖము సిఖము నంతనిండి నలరుచున్నది యే వొకరిని విడకుండ వెంట దగిలియున్నది. ॥ వినవె సఖీ ॥ వినవె ॥

2. నరులు సురులు చరులు నాదు। పరమెయన్నదీ। యీ ధరలో మోహపరులు నాకు దాసులన్నదీ ॥ వినవె ॥

3. సతులు సుతులు సంపద నా స్వంతమన్నదీ । భూపతులనైన విడక శ్రమలు బెట్టుచున్నదీ । వినవె సఖీ ॥ వినవె ॥

4. సిరిని మరుని హరుని గూడ। మరిగియున్నదీ। యా। పరమశివుడు అజుడు నాకు పాపలన్నదీ । ॥ వినవె సఖీ ॥

5. యేడు, మూడు ఆరు నాకు తోడుయన్నదీ । యీ పాడులోకమంత తాను ప్రబలి యున్నదీ ॥ వినవె ॥

6. యెరుక జగమునందుచాల ।యె । గురుచున్నదీ । యే యెరుకలేని వారి కడకు యేగనన్నదీ ॥ వినవె సఖీ ॥ వినవె

7. ఆశపాశవాసులె నాయనుజులన్నదీ । యే । ఆశలేని వారికి తానంటకున్నదీ ॥వి॥

8. బుద్ధి శుద్ధిలేని వారి యొద్ద నున్నదీ । యీ । సిధ్ధులూరు విడచి పోను । సిద్ధమైనదీ ॥ వినవె ॥ వినవె సఖీ

## 45. తత్వము

1. ఉన్నవి నీలో వుంచుక అచలుడ ననన ఫలంబే మున్నదిరా । ఉన్నవాటి నెగ దన్నిన వానికె । అన్న విన్న సుఖమున్నదిరా ॥ వున్న ॥

2. నాది గొప్పదని వాదము లాట । మోదముగాదని । దెలియుమురా । బేధ భావములు దెలియని బ్రహ్మకు వాదులాడె పని యెందుకురా ॥ వున్న ॥

3. కుర్రకుంక తో బుర్రను జూచుక । వెర్రివాని వలె యెగురకురా । అర్రులు జాచెటి అహములో జిక్కితె । ఆత్మజ్ఞానము గలుగదురా ॥ వున్న ॥

4. కదలని యెందలని దానికి యెప్పుడు । కలతయె లేదని నమ్ముముకురా । వదలని బ్రాంతిలో పడి బడి తిరిగెతె । పదపడి జన్మముదప్పదురా ॥ వున్న ॥

5. పంచదశియని । పలుకుటె గాని । యించుక భ్రమ దొలగించరురా । సంచితార్థములు మంచివి గావనే । సాధులె స్వార్థము వీడరురా ।

6 వానిగ షోడశి వదులక జదివెటి । దాసులె దర్పము వీడరురా । భాసురముగ భువి వాసనలను విడి వాంఛలు దూరము జేయరురా ॥ ॥ వున్న ॥

7. బట్టబయలు యింకేమియు లేదని । బలికిన మోక్షము దొరుకదు రా । గట్టిగ నీలో గల దుర్గుణముల । గొట్టక గోప్యము దెలియవురా ॥ వున్న ॥

8. పదిరెండింటికి ఫలితమెరింగిన ప్రజ్ఞవాదమింకెందుకురా । ముదముతో సిద్ధుల పురమున సద్గురు । సదనముగని । సుఖియించుమురా ॥ వున్న ॥

## 46. తత్వము

1. తోలుబొమ్మ కీలు దెలియ జాలనీ జాతీ । వుల్లాసము తోడ వురుకు లాడును ప్రీతి॥ జాలు నెరసి తెల్లబడిన । అలునిడువదు । తోలు ముడుత బడిన బ్రతుకు । త్రోవగానదు। గాలిపటము రీతిదాని గతియె దెలియదు । గూలి పోవ సిద్ధమైన। గుణము మారదూ ॥ తోలు ॥

2. సారమింతలేనిది । సంసారము జూచీ । బారమనక మోయుచుండు మాయపిశాచీ। కోరిగురుని చెరణములను వ్రాలదు లేచీ । నోరు విప్పగానె బడును నరులతో పేచీ ॥ తోలు ॥

3. కాసులపై బ్రాంతినెపుడు కాల్చి వేయదూ । భాసురముగ భక్తులగని దోసిలొగ్గదూ వీసమైన మంచిమాటా । వినగ నోపదూ । దోషరహితమైన త్రోవ దొరుకబట్టదూ ॥ తోలు ॥

4. నీతిమార్గమందు నడువ నిచ్చగించదూ । పాతకంపు పనులకైతె భీతిజెందదూ । వీతరాగములను నెపుడు విడచియుండదూ। సాత్వీకపు నరుల జూచి సంతసించదూ ॥ తోలు ॥

5. నిర్ధమైన మాటలపై శ్రద్ధ జూపదూ । వద్దనున్న దుర్గుణముల వదలిపెట్టదూ । శుద్ధమైన బ్రహ్మనెపుడుచూడగోరదూ । సిద్దులూరి యందు మనసు । స్థిరము నుంచదూ ॥ తోలు ॥

# 47 తత్వము

సంపత్తి గుదరక

1. సాధన ~~సపత్తి గుదరక~~ । బోధ జేసిన వట్టిదే ।
క్రోధ భావము వదులనట్టి । సాధకుల గతి అట్టిదే ॥ సాధన

2. తామసంబును । వదలకుండగ । తత్వమెరుగుటవట్టిదే ।
నేమనిష్ఠలు నెరుగనట్టి । పామరుల గతి నట్టిదే ॥ సాధన

3. మూఢులకు యీ జగమునందున । ముక్తిదొరుకుట వట్టిదే ।
గాఢమయ్యిన మోహభ్రాంతులు గల నరుల బ్రతుకట్టిదే ॥ సా

4. పాములైదిటి అహము దృంచక । పరము జేరుట వట్టిదే ।
కామములబడి పొరలు చుండెటి । కలినరుల గతి అట్టిదే ॥సాధ

5. మానము అభిమానమిడువక । మాయదాటుట వట్టిదే ॥
జ్ఞాన హీనుని లక్షణంబులు । గాంచి చూడగ నట్టివే ॥ సాదన

6. యజ్ఞయాగములెన్ని జేసిన । యెతిగ మారుట వట్టిదే।
ప్రజ్ఞవాదము లాడనేర్చిన । ప్రజల జీవితమట్టిదే ॥సాధన

7. ద్వందపద్ధతిలోన జిక్కితె । దైవమును గనుటొట్టిదే,
మందబుద్ధుల యందు దిరిగెటి । మానవుల గతి అట్టిదే ॥సాధన

8. నాల్గు తనువుల నంతు దెలియక । నాత్మ నెరుగుట వట్టిదే ।
నీల్గుచును పరనింద జేసెటి । నీచుల బ్రతుకట్టిదే ॥ సాధన

9. యేడుమేడలు యెక్కకను యా వెలుగు జాచుట వట్టిదే
కాడు లోపల గాలు శముకు వేడిదెలియానటులే. ॥ సాధన

10. నిరతము శ్రీ గురు నీ స్మరణను । మరచి తిరిగెతె వట్టిదే ॥
ధరణి శిద్దుల పురము లోపల నరుల జీవిత మిట్టిదే ॥ సాధన

# విజ్ఞాపన

శృతి : దుర్లభం మానుషం దేహం వివేకం అతిదుర్లభం

అను నార్యోక్తి ననుసరించి ఎనుబది నాలుగు లక్షల జీవజంతువులలో మానవ జన్మ కలగడము దుర్లభం. అందులో వివేకం కలగడం అతిదుర్లభం . యిట్టి దుర్లభమైన మానవ జన్మ కలగడం యొక మోక్షము జెందడమునకే కానియితరమైన విషయమునకు కాదు. యెట్టులనగా ఎనుబది నాలుగు లక్షల జీవజంతువులలో యొక మానవజన్మదప్ప మిగతా జన్మములకు ధర్మార్థ కామములన్నవి. మానవ జన్మమునకు **ధర్మార్థ కామమోక్షములున్నవి**. కావున యిట్టి వుత్కృష్ఠమైనట్టి జన్మలోమోక్షమును శాశ్వత సౌఖ్యము జెందడము మానవ ధర్మమని నా సద్గురు కరుణా కటాక్షముచే విన్న కన్న మార్గమును సకల ముముక్షువులకు సులభోపాయముగ బోధపడునటుల జెప్పబూనిన విధంబెట్టిదనిన.

## చతుర్విధ శుశ్రూషలు

కందార్థం : నాలుగు శిశ్రూషణములు । లోలత గావించుకొనుచు లోకాతీతం ।
బాలోకించీ గురునిచె ।యీ లోకము జోలివిడువు ॥

॥ దర్వు ॥ మింతె చాలన్నా । నీతోగూడ । యిది మరువకన్నా । కీలుదెలియని చదువు
చాలజదివెందుకు । చాలించి నీవిట్టి కీలుదెలిసితి వేని ॥ యింటెచాలన్నా!
నీతో గూడ । యిది మరువకన్నా ॥

చతుర్విధ శిశ్రూషలనగ : 1. ఆత్మ 2. అంగ 3. స్థాణ 4.సద్భావ అను నాలుగు విధంబులు

అవి యెట్టులనగా

1. **ఆత్మ శుశ్రూష యనగా** : సద్గురుని కిష్టమగు పదార్థములను శక్తి కొలది ప్రేమాతి శయముగ సమర్పించుట

తన ప్రవర్తన మందు గురుమూర్తి కెట్టియనుమానము రాకుండ త్రికరణ శుద్ధిగా ప్రవర్తించుట ఆత్మ శుశ్రూషయనబడును.

2. అంగ శుశ్రూష యనగ :- సద్గురు మూర్తిని అభ్యాంగస్నానము చేయించి పాదసేవ యొనర్చి వస్త్రాభరణాలంకారము జేయుట.

నియమితాచారముగా శరీరమును ప్రవర్తింపజేయుట అంగ శుశ్రూష యనబడను. ఈ పద్ధతిచే బ్రహ్మతేజస్సు కల్గును. తద్వ్యతిరిక్తవర్తనచే శరీరము ప్రేతకళగా మారును. కావున సాధకుడంగ శుశ్రూష క్రమమున జాగ్రత్తగా ప్రవర్తింప వలెను.

3. స్థాన శుశ్రూషయ నగ :- సద్గురు మూర్తిని గృహ అరామ క్షేత్రాదులయందు పోషించుట.

తానెంతటి ధనధాన్యాది వస్తువాహన వితానములు గడించిన వాడైనను వర్ణా శ్రమాచారముల యందాధిక్యుడుగా నున్నను నిజ ధర్మ ప్రబోధకు గురుస్థానమునకు రావలయును. కాని తన స్థానమునకు గురువుల పిలిపించుకొని ధర్మమును దెలిసికొనగోరుట తగదు.

ఒకవేళ నట్లు శిష్యుడు గురువును తన గృహమునకు రప్పించుకొని ధర్మమెరిగినను దాని వలన ఫలముండదు. ఈ పద్ధతి గురువు శిష్య న్యాయమునకు విరుద్ధము. జనక కృష్ణాదులు స్థాన శుశ్రూష తెలిసిన వారు కావున యాజ్ఞవల్క సాంధీపాదుల చెంతకేగి శుశ్రూష నొనర్చి నిజబోధ నెరింగి ధన్యులైరి.

శ్రీరామ చెంద్రుడా క్రమమెరుంగక గురువగు వసిష్ఠుని తనచెంతకు బిలిపించుకొని ధర్మము తెలిసికొనెను. కావున శిష్య న్యాయము రాముని యందు సార్థకము కాలేదు ఇదియే స్థాన శుశ్రూష.

4. సద్భావ శుశ్రూషయనగ : - సద్గురువును బ్రహ్మమని విష్ణువని శంకరుడని పరబ్రహ్మమని తల్లిదండ్రి దొర దాత దైవము అప్తుడు బాంధవుడు సర్వమని ఇట్లు భావించి ధ్యానించుచు సద్గురు మూర్తిచే సాధన చతుష్టయములను యెరుంగ వలయును.

జనన మరణ భ్రాంతి రహితమునకు పదార్థ మావశ్యకమని సద్గురువుచే నిర్ణయ మొనర్పబడియున్నదో సర్వకాల సార్వస్థల యందట్టి పదార్థమందే భావముంచుట భావ శుశ్రూషయనబడును. కాని భావమందన్యదా సంకల్పములుండగూడదు. అట్లుండిన భ్రాంతి విస్తారమై జనన మరణములకు కారణమగును. ఇట్లు చతుర్విధ శుశ్రూషల ముముక్షువులు జాగ్రత్తగా నాచరించి ధన్యుడు కావలెను.

# సాధన చతుష్ఠయము

శ్లో : యస్యాత్సాధన సంపన్నా । ఈశ్వరస్య ప్రసాదత: ।
యజ్ఞాదికర్మకరణా । త్సాదికారి నిరూప్యతే ॥

1.నిత్యా నిత్య వస్తువివేకము 2. ఇహ మూత్రార్థ ఫలభోగ విరాగము 3. శమాది శట్క సంపత్తి 4. ముముక్షత్వములను నాలుగు విధములు

1. నిత్యానిత్యవస్తువివేకమనగ : పరమాత్మ నిత్యంబని జగంబనిత్యంబని యెరుంగుట.

సద్గురునిచే నిత్యమైనటువంటి పరిపూర్ణమును అనిత్యమైనటువంటి ప్రపంచమును దెలుసుకొనుట నిత్యానిత్యవస్తు వివేకమనబడును.

2. ఇహమూత్రార్థ ఫలభోగ విరాగమనగ : వితాది భోగంబులు తుచ్చంబని స్వర్గాదిలోకంబులు నట్లేయని యిహపర సుఖంబులు గోరకయుండుట.

మనము గుధస్థానము నుండి విడుచు మలమూత్రముల యందు ఎట్లు నీచమని వాటిని విడిచి పొదుమో అట్లే యితరుల వస్తులయందే గాక ధన ధాన్యసంపద సుఖ భోగంబులయందు నట్లే యిచ్చలేకుండుట ఇహమూత్రార్థ ఫలభోగ విరాగమనబడును.

3. శమాది శట్కసంపత్తియనగ : 1. శమము 2. దమము 3. ఉపరతి 4. తితీక్ష 5. శ్రద్ధ 6. సమాధానము అను ఆరు విధంబులు .

1. శమము : అంతరేంద్రియని గ్రహము
ఉదా : బ్రహ్మవిద్యా శ్రవణాదులందు దప్ప నితర విషయవాంఛలందు మనస్సును జొప్పింపక యితర శ్రవణాదులందు యిచ్చలేకుండుట శమమనబడును.

2. దమమనగ : బాహ్యేంద్రియ నిగ్రహము
ఉదా : జ్ఞాన కర్మేంద్రియంబుల ప్రవర్తన గురువులచే శ్రవణము చేసిన విషయములందు వర్తింపచేసి వ్యతిరిక్త విషయములందు జొరనీయకుండుట దమమనబడును.

3. ఉపరతియనగ : అరిషడ్వర్గముల జయించుట

ఉదా : స్వార్థ రహిత కర్మాచరణమే యుపరతియనబడును.

4. తితీక్షయనగ : సుఖదు:ఖముల కోర్చుట

ఉదా : కర్మానుసారముగా వచ్చు సుఖదు:ఖాదుల సంతోషముతో ననుభవించుట అనగా కష్టమందు దు:ఖముగాని, సుఖమందు సంతోషముగాని పొందక సర్వకాలములందే కత్వముతో నుండుట తితీక్షయమనబడును.

5. శ్రద్ధయనగ : శృతి ఆచారంబులయందు విశ్వాసముంచుట.

ఉదా : ఇతర విషయాదులపై గల శ్రద్ధనన్నిటి నుజ్జగించి సద్గురు నిశ్చయ ప్రబోధ విషయమందే శ్రద్ధ గలిగి యుండుట శ్రద్ధయనబడును.

6. సమాధానమనగ : గురు వాక్యములు. శాస్త్ర సమ్మతముగ విని సమాధానపడుట.

ఉదా : జనన మరణ రహిత పద్ధతి యందు సమాధానము గల్గి యితర పద్ధతులగు జీవ బ్రహ్మైక్య యోగయోగాంగముల యందు సమాధానములేక యుండుట సమాధానమనబడును.

4. ముముక్షత్వము : మోక్షము నందు ఆపేక్ష కలిగి యుండుట

ఉదా : ధన సంపాదన వలన దారిద్ర్య మోక్షము , సంతానప్రాప్తి వలన పరలోక మోక్షము. సాధనల వలన జీవ బంధ మోక్షము కల్గుచున్నదను పద్ధతి ముముక్షత్వము కాదు. జనన మరణ భ్రాంతి రహితమే ముముక్షత్వమని తెలియవలెను.

ఇట్లు సాధన చతుష్టయ సంపత్తి గలయతండు అధికారియని పించుకొనును. అట్టి యధికారికి నాలుగు సాధనములు యెందుకు జెప్పవలెను. నిత్యానిత్య వస్తు వివేకమను నొక్క సాధన యుంటె సరిపోదా. సరిపోదు యెందుకనగా...

ప్రపంచమున నిత్యానిత్యవస్తు వివేకముగల వారలు విషయాదులయందు ఆశక్తి కలిగికామ్య కర్మముల జేయుచున్నారు. కనుక వారలకు అధికారత్వము లేదు కావున రెండవ సాదన కావలయును.

నిత్యానిత్య వస్తు వివేకము ఇహాముత్రార్థ ఫలభోగ విరాగమను రెండు సాధనములు సరిపోదా. సరిపోదు ఎందుకనగా కొందరు ఋషీశ్వరులకు పై రెండు సాధనములన్నను వారికి కోప తాపములు మెండుగా యుండును. కావున శమాది శట్క సంపత్తియను మూడవ సాధన యవసరము.

పై మూడు సాధనములునన్నను సరిపోదా సరిపోదు ఎందుకనగా... లోకమందు మూడు సాధనంబులు గలవారు కృష్ణా జనంబులు చంక నిడుకొని తలలు బెంచుకొని యోగులమని పేరు బెట్టుకొని సంసారమును విడిచిపెట్టి విరక్తులై ప్రతి విగ్రహమును లేకనే కొందరు గలరు. వారు శ్రవణమంటె దగ్గరకు చేరరు. కనుక వారికి అధికారత్వము లేదు. కావున ముముక్షత్వమను నాల్గవ సాధనలు కావలయును. పై నాల్గు సాధనంబులు గలవాడే వేదాంత విచారణమున కధికారి అట్టి అధికారి తన పూర్వ జన్మ పుణ్య విశేషముచే సద్గురువు నాశ్రయించి జనన మరణ భ్రాంతి రహితమను మోక్ష మార్గము దెలుపవలయునని కోరగ శ్రీ సద్గురుమూర్తి కరుణామృత దృష్టిచే సచ్ఛిష్యుని దగ్గరకు బిలిచి హస్తమస్తక సంయోగము గావించి స్వస్తికాహణ స్పర్శ త్రివిధ దీక్షలిచ్చి పరిపూర్ణ మొకటి లేనెరుకయనునొకటి యెరిగించి యెరుకను తీసివేయు విధము దెలిపెదను నిశ్చల మనస్సు గలవాడవై వినుము.

## త్రికరణ శుద్ధి ప్రవర్తన

జననమరణ రహిత పద్ధతి వినుటకు ప్రథమ సాదనము

1. తన సంతతిపై గల ప్రేమయే యితర సంతానముపై నుంచి సమానత్వముతో ప్రేమించి వర్తించిన నంత: కరణ శుద్ధియగును.
2. వితదత్వములేని స్వార్థ రహిత సత్య సంభాషణ మొనర్చు వాక్కు సత్యవాక్కని చెప్పబడును యిట్టి వాక్కుతో నుండిన వాక్కు శుద్ధి గలుగును.
3. స్వార్థత్యాగమగు నుపకారముచే శరీర శుద్ధి గల్గును. (యిట్టి పద్ధతులకు వ్యతిరక్తముగా వర్తించు ప్రవర్తననచే త్రికరణములకు నశుద్ధత్వ వర్తనము సంభవించు చున్నది)

త్రికరణ శుద్ధియనగా తనువున వాక్కున మనసున పని ఏకముగా జరుపు నటువంటిది.

# త్రివిధ దీక్షలు

1. మనోదీక్ష 2. దృక్ దీక్ష 3. స్పర్శ దీక్ష యను త్రివిధ దీక్షలనబడును.

దృష్టి యనగా చూపు. బుద్ధియని నిర్ణయము. యిందు మృత దృష్టి, అమృత దృష్టియని రెండు విధములు .

గురువులు తమ శిష్యులను కడతేర్చుటకు వారిపై అమృత దృష్టియను ప్రేమ రసమును వెదజల్లుచు వారిని మనస్సు చేతనో దృక్కు చేతనో, స్పర్శ చేతనో తరింప జేయుదురు. మృతదృష్టిచే శిష్యుని చూచినచో దరిజేరని వాడగును. కావున

ఉదా : తాబేలు, చేప, పక్షి దృష్టాంతములు చెప్పుదురు.

1. మనో దీక్ష : తాబేలు పిల్లలను చేసి తాను పిల్లలు వేరువేరుగా యెచ్చట సంచరించు చున్ననూ, ఆ పిల్లల మనస్సు తల్లిపైననూ, తాబేలు తన మనస్సుతో పిల్లలను తలంచినంత మాత్రము వాటి ఆకలి తీరిపోవుచున్నది. అదే పద్ధతిగా శిష్యుడు తనకు జ్ఞానోపదేశము చేసిన గురువేదేశము యందుండిననూ. అతని మనసెల్లప్పుడు గురుని పాద పద్మములయందు లగ్నమైయున్న యెడల అతడమృతుడగుచున్నాడు యీ పద్ధతి మనోదీక్షయనబడును.

2. దృక్దీక్ష : చేపలు గ్రుడ్లను బెట్టి ఆ గుడ్లను తదేక దృష్టితో చూడగా యా గ్రుడ్లు పగిలి పిల్లలగుచున్నవి.

అట్లే శిష్యుడు గురుని సమీపము నందుండి ఎల్లప్పుడతని స్వరూపమును వీక్షించుచు యేక చిత్తముతో నున్నచో గురువతనిని కరుణ దృష్టితో చూడగనే యతడు అమృతతత్వమును బొందుచున్నాడు. యిది దృక్ దీక్షయబడును.

3. స్పర్శదీక్ష : పక్షులు గ్రుడ్లను బెట్టి వాటిని పొదుగుటచే నవిచిట్లి పిల్లలగు చున్నవి.

అట్లే శిష్యుడు ఏకాగ్రచిత్తుడైయున్న సమయమున గురువు మస్తకము నందు తన హస్తము నుంచి మంత్రోపదేశము చేయగనే యతడమృత తత్వమును పొందు చున్నాడు. యిది స్పర్శదీక్షయనబడును.

# భక్తి జ్ఞాన వైరాగ్య తత్వము ముక్తత్వ నిర్ణయము

భక్తి : భయముచేత గూడిన ప్రేమ భక్తి యనబడును. త్రికరణంబులగు మనోవాక్కాయముల యేకైక రూపమగు నాత్మ సమిష్ఠియందు పరమాత్మగా జెప్పబడును. కావున త్రికరణ శుద్ధితో ప్రవర్తించిన నాత్మకు విశుద్ధత్వము గల్గి పరమాత్మ స్థితి సిద్ధించును. అట్లుగాక నియమాతిరిక్తముగా వర్తించిన నాత్మకు పాపభూయిష్ఠ మతిశయిల్లి నీచయోనిత్వప్రాప్తి తటస్థించును. ఇట్లు త్రికరణ శుద్ధియందు నిశితదీక్షయు ప్రవర్తనయందు బీతియు నాత్మయందు ప్రేమయు గల్గి వర్తించు ప్రవృత్తిని భక్తియని చెప్పబడును.

కేవలము పరమాత్మయందే అనన్యమగు భక్తి ప్రేమ అనురాగము ఆసక్తి యుండవలయును కాని వేద పఠనవలన గాని యజ్ఞయాగాదుల వలన గాని భగవద్దర్శనము కాజాలదు. కావున గురువుపైన శిష్యుడు అనన్య భక్తి భావనతో నడుచుకొంటె భగవద్దర్శనమునకు ఉపాయమార్గము సూచించును.

పంపకములేని భక్తి మఱియొక వస్తువుపై చెదిరిపోని భక్తి పరమాత్మతప్ప అన్య వస్తువును అభిలషింపని భక్తి అనన్యభక్తి యనబడును.

జ్ఞానము: తనయందు సర్వమును సర్వమునందు తనను దెలియునట్టిది జ్ఞానము. జ్ఞానము యొక్క పరిణామమగు జ్ఞానేంద్రియముల ద్వారా విషయ పంచకమును గ్రహించి కర్మేంద్రియములచే కర్మలనొనర్చి వానిచే గల్గు ఫలాఫలంబుల యనుభవించుటకు తానే కారణమనియు సకల పరిణామంబులు బీజ వృక్షన్యాయమున తానే యగుననియు తెలియునట్టి జ్ఞానమే జ్ఞానమనబడును.

కాని యితర విషయములెన్ని యెరిగినను నది జ్ఞానమని చెప్పబడదు. మరియు తన్ను తానెరుంగక తనకన్న భిన్న పదార్థముల నెరిగి వానిచే నేను రక్షింపబడు చున్నాను. అను నిట్టి పద్ధతి వాంఛామయముగా కావున దీని అజ్ఞానమని చెప్పబడును.

వైరాగ్యము : రూప నామక్రియా స్పదమగు నంతర్బాహ్య ప్రపంచమ నిత్యమని తెలిసి కొనుటకంటె వానిని దెలియు నట్టియు దెలియజేయు నట్టియు చేతన బ్రహ్మమే యనిత్యమని తలంచి దానియందు వాంఛలేక యుండుట వైరాగ్యమనబడును.

తత్వము : ఉత్తమ పురుషుని పరిణామ రూపమగు క్షరాక్షర పురుషుల యొక్కయు శక్తి ద్వయ పరిణామమగు జీవజగదోపాధి స్వరూప పంచవింశతి తత్వముల యొక్క విచారణ వస్తు నిశ్చయముగా దెలిసికొనబడునది తత్వమనబడును.

మరియు అష్టప్రకృతులయొక్కయు నవద్రవ్యములయొక్కయు విచారణ నాత్మలో లొనర్చుట తత్వమనబడును.

ముముక్షత్వము : జనన మరణ భ్రాంతి రహిత స్థితియు తనతో సర్వము రహితమై గుర్తులేని స్థితియు ముముక్షత్వమనబడును.

శ్లో : సహస్రయుగ పర్యన్త మహర్యద్బ్రహ్మణో విదు : ।
రాత్రింయుగసాహస్రాన్తాం తేరోరాత్ర విదోజనా : ॥ (గీ. 8 - 17 లో)

తా. ఏ జనులు బ్రహ్మదేవుని యొక్క పగటిని వేయి యుగముల పరిమితి గల దానిగను అట్లే రాత్రిని వేయి యుగముల పరిమితి గల దానిగను ఎఱుగుదురో అట్టి వారు రాత్రింబగళ్ళ యొక్క తత్వమును బాగుగా నెరింగిన వారగుదురు.

బ్రహ్మలోకము వరకు గల సమస్త లోకములు కాలమునకు లోబడినవని క్షయశీలములని పరిణామవంతములని జన్మకారణములని వేదములు శృతులలోనె తెలపబడినది. ఇచట బ్రహ్మదేవుని యొక్క కాలపరిమితిని సూచించుచు తద్వారా బ్రహ్మలోకమున్ను కాలమునకు లోబడియే యున్నదను భావమును భగవానుడు వ్యక్తీకరించుచున్నాడు. బ్రహ్మదేవుని పగలు వేయి మహాయుగముల కాలము. అట్లే అతని రాత్రి వేయి మహాయుగములు. ఈ ప్రకారము బ్రహ్మదేవుని ఒక్కరోజు రెండు వేల మహాయుగముల కాలపరిమితి గలిగి యున్నది. మహాయుగమనగా నలుబడి మూడు లక్షల యిరువది వేల సం॥ల కాలము ఎట్లనిన

| | | |
|---|---|---|
| కలియుగము | = 4,32,000 | సంవత్సరములు |
| ద్వాపరయుగము | = 8,64,000 | (రెండు రెట్లు) సం ॥ |
| త్రేతాయుగము | = 12,96,000 | (మూడురెట్లు) సం॥ |
| కృతయుగము | = 17,28,000 | (నాలుగు రెట్లు) సం॥ |
| మొత్తము | = 43,20,000 | 1 మహాయుగము |

ఈ మొత్తము కాలము ఒక మహాయుగమనబడును. అట్టి వేయి మహాయుగములు బ్రహ్మదేవునకు ఒక పగలు మరియొక వేయి రాత్రి అనగా

43,20,000 × 1000 = 432000000 సం.లు.

బ్రహ్మదేవుని పగలు

4320000000 × 2 = 8640000000 సం॥లు బ్రహ్మదేవుని ఒక రోజు...

ఇట్టిరోజులు 360 చేరి బ్రహ్మదేవుని ఒక సంవత్సర కాలమగును. అట్టి సం.లు 100 చేరి బ్రహ్మదేవుని ఆయుర్దాయమగును. దీనిని బట్టి బ్రహ్మలోకమున్ను కాలగర్భమున ఇమిడియే యున్నదనియు ఒకానొక సమయమున అదియు నశించియే తీరుననియు స్పష్టమగుచున్నది. కావున కాలాతీతుడగు పరమాత్మనే ఆశ్రయించి తరించి పోవుదురు.

ఏ మహనీయుని యందు దేశ కాలాదులన్నియు కల్పితములై వెలయుచున్నవో అట్టి సత్యస్వరూపుడగు పరమాత్మ నాశ్రయించుటయు కాలమునకు లోబడిన వానియందు విరక్తి గలిగి యుండుటయు కాలతత్వము నెఱిగిన వాని లక్షణము.

ఆత్మ యొక్క శాశ్వతత్వము నెఱింగినవాడె కాలజ్ఞానము గలవాడు అహోరాత్రవిదుడు.

శ్లో. స్థావరో లక్షవిశత్యా జలజో నవలక్షష
క్రిమిణాంరుద్ర సంఖ్యాశ్చ చాతుర్లక్షంతు మానుష
త్రిల్లక్షం గహనాంచ పక్షిణాందవలక్షకమ్ ॥

తా. వృక్షాతి స్థావర వర్గములు (20) లక్షలు. వీటియందు బుట్టిన మత్స్యాది జలవర్గములు '9 లక్షలు మొదలగు క్రిమి వర్గములు (11) పదకొండు లక్షలు. మనుష్య జాతి భేదములు (4) నాల్గు లక్షలు. గోవు మొదలగు మృగవర్గములు (30) ముప్పది లక్షలు. పక్షి వర్గములు (10) పది లక్షలు.

అంతా మొత్తము యెనుబడి నాలుగు లక్షలు (84) జీవరాసులు గలవు వానిలో మనుష్య జన్మము సూత్రము దుర్లభంబు ॥

# మానవుని ఆయు ప్రమాణము

(ఓ.సా. పే.నెం. 269)

గంటలను చూపునది గడియారము జీవులయొక్క ఆయుర్భాగమును జూపునది శ్వాస.యుగములను జూపునది దినములు. వారములు సంవత్సరము లేగాని మరివేరు కాదు. మరియు మనలో నున్న ఆత్మ (పరమాత్మ) హంసరూపముగా అనగా సొహం అను మంత్ర రూపముగా పిపీలికాది బ్రహ్మపర్యంతము నిండియున్నాడు. ఈ సొహం అనునదే "ఓం" అనుతారక మంత్రము ఎట్లనగా "సొ" అను మంత్రము నందు "ఓ" అనెడి బీజాక్షరమును "హం" అను మంత్రము నందు "ం" నున్న బిందు. ఈ రెండక్షరములు జేరి 'ఓం" అను శబ్దము పుట్టెను.

ఇట్లు "సొహం" అని శ్వాస తనకు తానుగానె జపించు చుండెడి మంత్రమును యోగులు కనిపెట్టి ఆశ్వాసను ఖర్చుచేయక నిలిపియున్నందున వారలు. కాలుని జయించి అనేక వేల సంవత్సరములు జీవించి యున్నారనిపెద్దలు వక్కాణింతురు. ఇట్టి రహస్యములను పురుషులు దెలిసికొనలేక వారి వారి శ్వాసలను యెట్టెట్లు ఖర్చుచేయుచున్నారో దానిని క్రింద చెప్పుచున్నాము.

1. సాధారణముగా మాట్లాడునప్పుడు 12 అంగుళము శ్వాస బయటికి వెళ్ళి తిరిగి శ్వాస బయటికి వెళ్ళి తిరిగి శ్వాస 8 అంగుళములు లోపలికి ప్రవేశించి 4 అంగుళము శ్వాస బయట నష్టమగుచున్నది. (12 - 8 = 4)

2. నడుచునప్పుడు 16 అంగుళముల శ్వాస బయటికి విడిచి 8 అంగుళముల శ్వాస తిరిగి లోపలికి పొగా మిగిలిన 8 అం.బయట నష్టమగుచున్నది. (16 - 8= 8)

3. చేతి పనులు చేయునప్పుడు 20 అం.ల శ్వాస బయటికి వెడలి 10 అం.ల శ్వాస లోపలికి పొగా మిగిలిన 10 అం. బయట నష్టమగుచున్నది. (20 - 10 = 10)

4. వివాద పడునప్పుడు 24 అం.ల శ్వాస బయటకు వెడలి 12 అం. ల శ్వాస లోపలికి పొగా మిగిలిన 12 అం.ల శ్వాస బయట నష్టమగుచున్నది. (24 - 12 = 12)

5. నిద్రపోవునప్పుడు 48 అం.ల శ్వాసలు బయటికి వెడలి 30 అం. లోలపికి వెడలి మిగిలిన 18 అం.ల శ్వాసలు నష్టమగును.

6. పరుగెత్తునప్పుడు 54 అం.ల శ్వాసలు బయటికి వెడలి 27 అం.ల శ్వాసలు లోపలికి పోగా మిగిలిన 27 అం.లు నష్టమగుచున్నవి.

7. సంభోగ కాలమున 64 అం.ల శ్వాసలు బయటికి వెడలి 24 అం.ల శ్వాసలు లోపలికి పోవును . మిగిలిన 40 అం.ల శ్వాసలు బయట నష్టమగుచున్నది.

ఇట్లు ప్రతి మనుజుడును ప్రతి దినము నలుబది యేబది వేలుగ శ్వాసలను వ్యయపరిచినచో తన శత సంవత్సర పరిమితిని తప్పి అరువది దెబ్బది సంవత్సరములు మాత్రమే జీవించి యుండును. ప్రతి మనుష్యునకు శ్వాస 21,600 చొప్పుననే వ్యయపరుచు చుండినచో 100 సం. జీవించి యుండగలడు. 21,600కు మించి శ్వాసలు ఖర్చు చేయుచు వచ్చినచో ఆ సాప్తిని ఆయుర్ధాయమును క్షీణింపజేయును. ఈ పరిమితికి అనగా 21,600 కు తక్కువగా శ్వాసను వదులునట్లు యోగాది సాధనములచే ప్రయత్నించినచో తన ఆయుర్ధాయము తన వశమై యుండును.

యిందుకొక నుపాయము మీకు చెప్పుచున్నాము వినుడు (పే.నెం. 595) అదేమనగా మీరు నడిచినను నిలిచినను గూర్చున్నను సరే శ్వాసను బీల్చి అటు నిటు దిక్కులు చూడక భూమి క్రింది వైపున చూచుచు వెళ్ళవలయును. నిలిచినపుడును గూర్చున్నపుడును క్రిందగానె చూచుచుండవలయును. అప్పుడు మీ శ్వాస నిలచి యున్నందున మీ మనస్సు కూడా యెచ్చటికి పోక అట్లే నిలచియుండును. శ్వాసను నిలుపుటకు శక్తి లేకున్న యెడల మూరెడు పొడుగంతశ్వాసను బయట వదలి మరల బీల్చి మరల శక్తి కొలది నిలిపి మరల వదలి మరల బీల్చి అట్లే మాట్లాడు వేళ తప్ప తక్కిన కాలమంతయు సాధనము చేయుచురండు. అప్పుడు మీ మనస్సు వశమై ఆయుర్వృద్ధి యగుచుండును.

శ్లో. తస్య పుత్రాదాయ ముపయాంతి సుహృత తస్సాతు ।
కృత్యాన్ ద్విషన్తః పాకృత్యామ్ " జీవ. బ్ర. సా. 596)

తా. తత్త్వ జ్ఞానము పొందిన మహాయోగులు తత్త్వ జ్ఞానము పొందక మునుపు అర్జితము చేసి యుంచిన గృహ వస్తు వాహనాది ద్రవ్యములను పుత్ర పౌత్రులు గ్రహించు కొనుచున్నారు. ఆ మహాయోగులకు అన్నపానాదులు యిచ్చువారు. ఆ యోగుల యొక్క పుణ్యమును గ్రహించు కొనుచున్నారు.

వారిని లక్ష్యపెట్టక పరిహాసది కార్యములను చేయునట్టివారు. వారి పాపకర్మములను పంచుకొనుచున్నారు.

## సాంఖ్యయోగము

### (ప్రపంచోత్పత్తి లక్షణము)

(భ.రా.శ. లోని సా. 15)

సీ. ఆత్మయందున యేక మాకాశముదయించె । ఆకాశమందనిల మపుడు బుట్టె। ననిలంబువల్లను నగ్రిహోత్రుడు బుట్టు। నగ్నిహోత్రమువ ల్ల నప్పుబుట్టు। నప్పువల్లను మహానవనీ స్థలియు బుట్టె। నోషదులందున నొనర నన్నము బుట్టె। నన్నమందున నరులాది సగల ॥ గీ ॥ జంతుజాలంబులాయె నీ జగయు గంబు। లయా నీ రీతి పరమాత్మ మాయవలన ॥ రమ్యం గుణథామ భద్రాద్రి రామ పరశురామ నరసింహ్మాదాస సంరక్షితాహ్వ ॥

తా. ఆత్మయందు ఆకాశము, ఆకాశమందు వాయువు. వాయువందు అగ్ని, అగ్నియందు జలము, జలమందు పృథివి , పృథివియందు ఓషదులు, ఓషదులందు అన్నము అన్నము నుంచి నరులాది సకల జంతుజాలము లాయెను. ఈ రీతిగా పింద బ్రహ్మాండములు పరమాత్మ మాయవలన ఆయెను.

# భూత సృష్టి

## ప్రపంచోత్పత్తి

శృతి : అధ్యాన్మహాకాశ: । మహాకాశాన్మయ వాయు । మహావా యోర్మహా తేజ: । మహా తేజాన్మహా సలీలం । మహాసలిలాన్మహ పృద్వీ ॥ ఆత్మానాకాశ:। సంభూత । ఆకాశాద్వాయ: వాయోరగ్ని : అజ్ఞరాప: అద్భ్య:పృథివీ । పృతివ్యాఓషదయ: । ఓషధిభ్యోన్నమ్ । అన్నాద్ రేత: । రేతస: । పురుష : । సవాఏషపురుషోన్నవ సమయ:॥

## నరప్రమాణము

సీ. నరుడు తొంబది యారు నంగుళాలెనిమిది । జాల పొడువునాల్జాన లెళుపు । యిట్లు ముప్పై మూడుకోట్ల రోమంబులు । వెలయ డెబ్బది రెండు వేల నాళ్ళు । యెముకలరువై యారు యమరి తొంబైరెండు । కీళ్ళు ముప్పై మ్మూడు మూళ్ళ పేగు। శేరు గుండెలు నర్థశేరు నురుధిరంబు । మణుగు నాలుగు శేర్లు మాంసముండు ॥ గీ ॥ సోలపైత్యంబు శ్లేష్మ మర్సోలెడుండు । నీ ప్రకారంబు దేహంబులెనిన చూడ ॥ రమ్యం.

తా. (96 అం. నరప్రమాణము) 8 జానల పొడవు 4 జానల వెడల్పు 33 కోట్ల రోమములు. 72 వేల నరములు. 66 ఎముకలు. 92 కీళ్ళు 33 మూళ్ల పెద్ద పేగు. ఒక శేరుగుండె అర్థశేరు రుధిరము. మణుగు నాలుగుశేర్లు. మాంసము (అనగా 14 శేర్లు) ఒక సోలెడు పైత్యము. అరసోలెడు శ్లేష్మము విచారింపగా సకల దేహము లీ ప్రకారముగా నుండును.

## తొంబదియారు తత్వములు

సీ. 3 జ్ఞానేంద్రియములైదు కర్మేంద్రియములైదు । శబ్దాదులైద కోశంబులైదు । కర్ణముల్నాల్గు రాగాదులెన్మిది పదినాళ్ళు వాయువులు పద్నాల్గునేడు । ధాతువు లైదు భూతము లారు చక్రాలు. మలములు మూడవ స్థలును నైదు । మూడు మండలములు మూడీషణంబులు మూడు వ్యాదులు గుణాల్మూడురెండు ॥ గీ ॥ తనువులను గూడిపణవత్యాది తత్వసాక్షి రూపుడవైనావు సత్యముగను ॥ రమ్య ॥

తా. 5 జ్ఞానేంద్రియములు 5. కర్మేంద్రియములు 5 విశ్లేంద్రియములు 5. కోశములు 4. అంత: కరణములు 8. రాగాదులు 10. నాడులు 14. వాయువులు 7. ధాతువులు 5. భూతములు 6. చక్రములు 3 మలములు 5 అవస్థలు 3. మండలములు 3.ఈషణములు 3. వ్యాధులు 3. గుణములు 2. తనువులు గూడి 96 తత్త్వము లాయెను. వీటికి పరమాత్మ సాక్షియని యెరుగవలెను.

## విశేషార్థము

5 జ్ఞానేంద్రియములు : శ్రోత్రము, త్వక్కు, చక్షు, జిహ్వ, ఘ్రాణము

5 కర్మేంద్రియములు : వాక్కు, పాణి, పాదము, గుహ్యము, గుధము

5 విషయేంద్రియములు : శబ్ధము, స్పర్శ, రూపము, రసము, గంధము

5 కోశములు : అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ అనునవి.

4 అంత:కరణములు : మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము.

8 రాగాదులు : 1. రాగము (పరస్త్రీ గమనము చేయుట) 2. ద్వేషము (అపకారము చేయుట) 3. కామము (కోరుట) 4. క్రోధము (కోరిక కొనసాగకుండుట) 5. లోభము (వచ్చిన ద్రవ్యము వదలకుండుట) 6. మోహము (ధనము మీద ఆపేక్ష గలుగుట) 7. మధము (ధనమున్నదని వుబ్బుట) 8. మచ్చరము (తన ద్రవ్య మపహరించెవాని మీదయీర్ష్య యుంచుట) యివి రాగాదులు.

10 నాడులు : 1. గాంధారి 2. హస్తిని 3. పూషా 4. అలంబ, 5. జిహ్వ 6. పయశ్విని 7. శంఖిణి 8. కులహ 9. సీనివాలి 10. రత్నహ్వాయ లివి దశనాడుల నబడును.

14 వాయువులు : 1. సమానము 2. వ్యానము 3. ఉదానము 4. ప్రాణము 5. అపానము 6. నాగము 7. కూర్మము 8. క్రుకురము 9. దేవదత్తము 10. ధనంజయ 11. అంతర్యామి 12. ప్రపంచకి 13. వజ్ర 14. ముఖ్య అనునవి 14 వాయువులు

7 ధాతువులు: 1. రసము 2. రుధిరము 3.మాంసము 4. మేధస్సు 5. మజ్జ 6. అస్తి 7 శుక్లము అనునవి ధాతువలనబడును.

5 భూతములు : 1. పృథివి 2. జలము 3. అగ్ని 4. వాయువు 5. ఆకాశము అవి పంచభూతములనబడును.

6 చక్రములు : 1. ఆధారము 2. స్వాధిష్ఠానము 3. మణిపూరకము 4. అనహతము 5. విశుద్ధము. 6. ఆజ్ఞేయము అవి షడ్చక్రములనబడును.

3 మలములు 1. అణవ మలము 2. మాయా మలము 3. కార్మిక మలము అనునవి మూడు మలములనబడును.

5 అవస్తలు 1. జాగ్రదావస్థ 2. స్వాప్నావస్థ 3. సుషుప్త్యావస్థ 4. తూర్యావస్థ 5. తూర్యాతీతావస్థ అనునవి పంచావస్థలనబడును.

3 మండలములు 1. అగ్ని మండలము 2. సూర్య మండలము 3. చంద్రమండలము అనునవి మండలములనబడును.

ఈషణత్రయములు : 1. ధారేషణ 2. పుత్రేషణ 3. ధనేషణ అనునవి ఈషణత్రయములనబడును.

వ్యాధిత్రయములు 1. వాతరోగము 2. పైతరోగము 3. శ్లేష్మరోగములను మూడు వ్యాధులు.

గుణత్రయములు 1. సత్వగుణము 2. రజోగుణము 3. తమోగుణములను త్రిగుణములనబడును.

రెండు తనువులు : 1. క్షరోపాది అక్షరోపాది అనునవి తనువులనబడును.

యీ 96 తత్త్వములను సాక్షిస్వరూపముగా యుండునది పరమాత్మయనబడును.

# పంచభూత లక్షణములు

సీ 4 వసుధాజలంబగ్ని వాయువాకాశంబు అవి పంచభూతముల్ వీటియందు ।
రక్తశుభ్రాసిత యుక్త ధూమ్రసునీలములు । గంధ రస రూపములును స్పర్శ ।
శబ్దంబులను క్రియాశక్తి జ్ఞానేచ్ఛాది శక్తులు పరపరాశక్తిల-వ-ర-య-అ-లజ విష్ణు
త్రియంబకేశ్వర । సదాశివులు నొండింటికి స్థిరముగాను ॥గీ॥ వర్ణ గుణశక్తి బీజ
దేవతలు నుండు । నీకు నే గుణములు లేవు నిర్మలుడవు ॥ రమ్య ॥

తా. పంచభూతములు 1. పృథివి 2. జలము 3. అగ్ని 4. వాయువు 5. ఆకాశము వీటియందు

పంచవర్ణములు : 1. రక్తము 2. శుభ్రము 3. అసితము 4. ధూమ్రము 5. సునీలము

5 గుణములు : 2 రసము 3. రూపము 4 స్పర్శ 1 గంధము 5. శబ్దము

పంచశక్తులు : 1 క్రియాశక్తి 2. ఇచ్ఛాశక్తి 3. జ్ఞానశక్తి 4. ఆదిశక్తి 5. పరాశక్తి అయిదు శక్తులు.

పంచబీజములు : 1. ల 2. వ 3. ర 4. య 5. అ యివి బీజములు.

పంచదేవతలు : 1.బ్రహ్మ 2. విష్ణు 3. రుద్రుడు 4. ఈశ్వరుడు 5. సదాశివుడు అను అయిదుగురు దేవతలు.

ఆత్మకు యే గుణములు లేవు మలినము లేనివాడు.

## పంచభూత ధర్మములు కర్మలు

ఆకాశము: బయలయ్యి యుండడము ధర్మము అవకాశమిచ్చుట కర్మము.

వాయువు : చలించడము ధర్మము చేర్చడము కర్మము

అగ్ని : వెలగడము ధర్మము కాల్చడము కర్మము

జలము : పోషించడము ధర్మము పదును చేయడము కర్మము

పృథివి : కఠినముగా ధర్మము ధరించుట కర్మము

## ప్రపంచోత్పత్తి - పంచభూత గుణ లక్షణములు

శృతి : బ్రహ్మణోక్షరవ్యక్తా : అవ్యక్తాన్ మహత్ మహతోహంకారా. అహంకారాత్పంచ తన్మాత్రాణి పంచతన్మాత్రేభ్యో పంచమహాభూతాని పంచమహాభూతేభ్యో అఖిలంజగత్

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆకాశము 40 బదికోట్లయో. విశాలం | వాయువు 30 కోట్ల యోజన ములు కలది | అగ్ని 20 కోట్లు యోజనములు విశాలం కలది | జలము 10 కోట్ల యో॥ కలది | పృథివి 1 కోటి యోజ॥ విశా. కలది. | |
| ఈశాన్య ముఖము | తత్పురుష ముఖము | అఘోర ముఖము | వామ దేవముఖం | సద్యోజాత ముఖము | |
| శబ్ధము | స్పర్శము | రూపము | రసము | గంధము | తన్మాత్రలు గుణములు |
| ఆకాశము | వాయువు | అగ్ని | జలము | పృథివి | భూతములు |
| సునీలము | ధూమ్రము | యుక్తలేకరక్త | శుభ్రాసితం | రక్తలేక పీతవర్ణములు | వర్ణములు |
| పరాశక్తి | ఆదిశక్తి | ఇచ్ఛాశక్తి | జ్ఞానశక్తి | క్రియాశక్తి | శక్తులు |
| హం వృత్తాకారం ○ | యం షట్కోణాకారం * | రం త్రికోణాకారం Δ | వం అర్థచంద్రా కారం U | లం చతురస్రా కారం □ | బీజములు ఆకారములు |
| సదాశివుడు | ఈశ్వరుడు | రుద్రుడు | విష్ణు | అజుడు | దేవతలు |
| మనోబ్రహ్మ | మయబ్రహ్మ | త్వష్టబ్రహ్మ | శిల్పిబ్రహ్మ | విశ్వబ్రహ్మ | పంచబ్రహ్మలు |
| ప్రణవవేదం | ఋగ్వేదం | యజుర్వేదం | సామవేదం | అధర్వణవేదం | పంచవేదములు |
| 5. అంగ్నుల వివరణ | ఆ॥ జ్ఞానాగ్ని | పాద॥ కాలాగ్ని | నాభి ॥ క్షుదాగ్ని | హృ ॥ శీతాగ్ని | నేత్ర ॥ కోపాగ్ని |

1. బ్రహ్మము 2. అవ్యక్తము 3. మహత్తు 4. మహదహంకారము 5. పంచతన్మాత్రలు
6. పంచ మహాభూతములు 7. అఖిలం జగత్తు 8. విరాట్టు

బ్రహ్మము : అనగా స్వయం ప్రకాశము (స్వయంభూ) బీజము లేక విత్తు

అవ్యక్తము : అనగా అంధకారము లేక చీకటి

మహత్తు : అనగా పై రెంటి వెలుగుచీకటుల నుండి కల్గినమెరుపులు

మహాదహంకారము అనగా ఆ మెఱుపుల నుండి కలిగిన కణములే మండుచున్న సూర్యగోళము లేక మెరుపులు నిలిచినవి.

పంచతన్మాత్రలు : అనగా వాటి గుణములు

పంచ మహాభూతములు : అనగా గుణములు నిలచిన స్థానములు

అఖిలం జగత్తు : అనగా సర్వం చచ్చిపుట్టునటువంటిది.

విరాట్టు : అనగా సర్వజీవోపాదుల గుంపుల స్వరూపము

బ్రహ్మము యొక్క పరిణామము అవ్యక్తము మహత్తు యొక్క ప్రేరేపణచె మహాదహంకార స్వరూపుడై పంచతన్మాత్రల ద్వారా పంచ మహాభూతముల నుండి అఖిలం జగత్తు యేర్పడెను.

1. బ్రహ్మము : యొక్క అథోముఖ పరిణామము ఆత్మ

2. అవ్యక్తము : యొక్క పరిణామము పంచ అదిష్ఠాన దేవతలు వారెవరనగా 1.సదాశివుడు 2. ఈశ్వరుడు 3. రుద్రుడు 4. విష్ణువు 5. బ్రహ్మ

3. మహత్తు : యొక్క పరిణామము పంచబీజములు. అవి యేవనగా అం, యం, రం, వం, లం యను బీజములు

4. మహదహంకారము : యొక్క పరిణామము పంచశక్తులు అవి యేవనగా పరాశక్తి, ఆదిశక్తి జ్ఞానశక్తి , యిచ్ఛాశక్తి , క్రియాశక్తి అనునవి పంచశక్తులు.

5. పంచతన్మాత్రలు : యొక్క పరిణామము పంచతన్మాత్రలు అవి యేవనగా శబ్ధ, స్పర్శ, రూప, రస గంధములనునవి పంచతన్మాత్రలనబడును.

6.పంచమహాభూతములు : యొక్క పరిణామము పంచ వర్ణములు అవి యేవనగా.
సునీల, ధూమ్ర, అసిత, శుభ్ర, రక్తము అనునవి పంచవర్ణములనబడును

7. జగత్తు : యొక్క పరిణామము 84 లక్షల జీవోపాదులు

8. విరాట్టు : యొక్క పరిణామము విశ్వరూపము (ప్రపంచము )

## స్థూల సూక్ష్మములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 2. | బ్రహ్మ | కన్న | విష్ణువు | సూక్ష్మము | |
| | విష్ణువు | కన్న | రుద్రుడు | సూక్ష్మము | |
| | రుద్రుని | కన్న | ఈశ్వరుడు | సూక్ష్మము | |
| | ఈశ్వరుని | కన్న | సదాశివుడు | సూక్ష్మము | |
| | సదాశివుని | కన్న | సర్వదేవతా | స్వరూపము | సూక్ష్మము |

| | | | |
|---|---|---|---|
| సర్వదేవతా స్వరూపము | కన్న | సదాశివుడు | స్థూలము |
| సదాశివుని | కన్న | ఈశ్వరుడు | స్థూలము |
| ఈశ్వరుని | కన్న | రుద్రుడు | స్థూలము |
| రుద్రుని | కన్న | విష్ణువు | స్థూలము |
| విష్ణువు | కన్న | బ్రహ్మ | స్థూలము |

| | | | | |
|---|---|---|---|---|
| 3. | లం బీజము | కన్న | వం బీజము | సూక్ష్మము |
| | వం బీజము | కన్న | రం బీజము | సూక్ష్మము |
| | రం బీజము | కన్న | యం బీజము | సూక్ష్మము |
| | యం బీజము | కన్న | అం బీజము | సూక్ష్మము |
| | అం బీజము | కన్న | సం బీజము | సూక్ష్మము |

| | | | | |
|---|---|---|---|---|
| | సం బీజము | కన్న | అం బీజము | స్థూలము |
| | అం బీజము | కన్న | యం బీజము | స్థూలము |
| | యం బీజము | కన్న | రం బీజము | స్థూలము |
| | రం బీజము | కన్న | వం బీజము | స్థూలము |
| | వం బీజము | కన్న | లం బీజము | స్థూలము |
| 4. | క్రియాశక్తి | కన్న | యిచ్ఛాశక్తి | సూక్ష్మము |
| | యిచ్ఛాశక్తి | కన్న | జ్ఞానశక్తి | సూక్ష్మము |
| | జ్ఞానశక్తి | కన్న | ఆదిశక్తి | సూక్ష్మము |
| | ఆదిశక్తి | కన్న | పరాశక్తి | సూక్ష్మము |
| | పరాశక్తి | కన్న | అప్రమేయశక్తి | సూక్ష్మము |
| | అప్రమేయ శక్తి | కన్న | పరాశక్తి | స్థూలము |
| | పరాశక్తి | కన్న | ఆదిశక్తి | స్థూలము |
| | ఆదిశక్తి | కన్న | జ్ఞానశక్తి | స్థూలము |
| | జ్ఞానశక్తి | కన్న | యిచ్ఛాశక్తి | స్థూలము |
| | యిచ్ఛాశక్తి | కన్న | క్రియాశక్తి | స్థూలము |
| 5. | గంధతన్మాత్ర | కన్న | రసతన్మాత్ర | సూక్ష్మము |
| | రసతన్మాత్ర | కన్న | రూపతన్మాత్ర | సూక్ష్మము |
| | రూపతన్మాత్రకన్న | కన్న | స్పర్శతన్మాత్ర | సూక్ష్మము |
| | స్పర్శతన్మాత్ర | కన్న | శబ్దతన్మాత్ర | సూక్ష్మము |
| | శబద్ధతన్మాత్రకన్న | కన్న | సర్వతన్మాత్ర | సూక్ష్మము |
| | సర్వతన్మాత్ర | కన్న | శబద్ధతన్మాత్ర | స్థూలము |
| | శబ్దతన్మాత్ర | కన్న | స్పర్శతన్మాత్ర | స్థూలము |
| | స్పర్శతన్మాత్ర | కన్న | రూపతన్మాత్ర | స్థూలము |
| | రూపతన్మాత్ర | కన్న | రసతన్మాత్ర | స్థూలము |
| | రసతన్మాత్ర | కన్న | గంధతన్మాత్ర | స్థూలము |

| | | | |
|---|---|---|---|
| రక్తవర్ణము | కన్న | శుభ్రవర్ణము | సూక్ష్మము |
| 6. శుభ్రవర్ణము | కన్న | అసిత వర్ణము | సూక్ష్మము |
| అసితవర్ణము | కన్న | ధూమ్రవర్ణము | సూక్ష్మము |
| ధూమ్రవర్ణము | కన్న | సునీల వర్ణము | సూక్ష్మము |
| సునీల వర్ణము | కన్న | ఆతమ్మ్రప్రకాశము | సూక్ష్మము |

| | | | |
|---|---|---|---|
| ఆత్మ్మప్రకాశము | కన్న | సునీలవర్ణము | స్థూలము |
| సునీల వర్ణము | కన్న | ధూమ్రవర్ణము | స్థూలము |
| ధూమ్రవర్ణము | కన్న | అసితవర్ణము | స్థూలము |
| అసితవర్ణము | కన్న | శుభ్రవర్ణము | స్థూలము |
| శుభ్రవర్ణము | కన్న | రక్తవర్ణము | స్థూలము |

## పంచభూత ఆకారములు

| | | |
|---|---|---|
| ఆత్మ | : | పాటలీవర్ణాకారము |
| ఆకాశం | : | వర్తులాకారము |
| వాయు | : | * షట్కోణాకారము |
| అగ్ని | : | Δ త్రికోణాకారము |
| జలము | : | U అర్థచంద్రకారము |
| పృథ్వి | : | □ చతురస్రాకారము |

## పంచభూత అంశములు

| | | |
|---|---|---|
| పృథ్వి | : | కఠినాంశము |
| జలము | : | ద్రవాంశము |
| అగ్ని | : | ప్రకాశాంశము |
| వాయువు | : | చలనాంశము |
| ఆకాశము | : | అవకాశాంశ స్వరూపము |
| ఆత్మ | : | సర్వ సప్తాంగ స్వరూపము |

## పంచభూత గుణములు

సీ. రూఢి శబ్ద స్పర్శ రూపముల్ రసగంధములు నైదు పృథివియందలరియుండు। రసరూప శబ్ద స్పర్శంబులు నాలుగు జలమందు జనితమై చెలగియుండు। నగ్ని హోత్రము నందు నమరి రూప స్పర్శ। శబ్దముల్ మూడు నిశ్చయము గాను। వాయువందున స్పర్శవర శబ్దములు రెండు నంబరంబందు శబ్దంబు నొకటి ॥ గీ॥ యొక్కటియు లేక దిక్కులు పిక్కటిల్లగ వెలుగు చున్నావు లోపల వెలుపలనక ॥రమ్య ॥

తా. భూమికి :' శబ్ద స్పర్శ రూప రస గంధములు అను అయిదు గుణములు

జలమునకు : రస రూప శబ్ద స్పర్శంబులను నాలుగు గుణములు

అగ్ని : రూప స్పర్శ శబ్దంబులను మూడు గుణములు.

వాయు : శబ్ద స్పర్శములు రెండు గుణములు

ఆకాశమునకు : శబ్దము ఒకటే గుణము ఆత్మకు యే గుణము లేక అష్టదిక్కుల యందు లోపల వెలుపలనక నిండుకొని యుండును.

## సూత్రాత్మ

1. ఈ సూత్రాత్మ పృథ్వియొక్క అదిష్ఠాన దేవత యగు బ్రహ్మస్వరూపంబున "లం" బీజము యొక్క ప్రేరేపణచే క్రియాశక్తి స్వరూపుడై గంధ తన్మాత్ర ద్వారా పృథ్వి నుండి సకల జీవోపాదులను సృష్ఠింపజేయును. కావున యిది పృథ్వి భూత స్థబకము.

2. ఈ సూత్రాత్మ జలము యొక్క అదిష్ఠాన దేవతయగు విష్ణుస్వరూపంబున "వం" బీజము యొక్క ప్రేరేపణచె యిచ్ఛాశక్తి స్వరూపుడై రతన్మాత్ర ద్వారా జలము నుండి సకల జీవోపాదులను పోషింపజేయును. కావున యిది జలభూత స్థబకము.

3. ఈ సూత్రాత్మ అగ్నియొక్క అదిష్ఠాన దేవతయగు రుద్రరూపంబున "రం" బీజము యొక్క ప్రేరేపణచె జ్ఞానశక్తి స్వరూపుడై రూపతన్మాత్ర ద్వారా అగ్ని నుండి సకల

జీవోపాదులను లయింపజేయును అనగా రూపముల నిచ్చి మార్చును. కావున యిది అగ్నిభూత స్థబకము.

4. యీ సూత్రాత్మ వాయువు యొక్క అదిష్టాన దేవతయగు ఈశ్వర స్వరూపంబున "యం" బీజముయొక్క ప్రేరేపణచె ఆదిశక్తి స్వరూపుడై స్పర్శ తన్మాత్ర ద్వారా వాయువు నుండి సకల జీవోపాదులను విస్తీర్ణమొనర్చును. కావున యిది వాయు భూతస్థబకము.

5. యీ సూత్రాత్మ ఆకాశము యొక్క అదిష్టాన దేవతయగు సదాశివ స్వరూపంబున "అం" బీజముయొక్క ప్రేరేపణచె పరాశక్తి స్వరూపుడై శబ్ధతన్మాత్ర ద్వారా ఆకాశము నుండి సకల జీవోపాదులను ఆకర్షింపజేయును కావున యిది ఆకాశ భూతస్థబకము.

## సూక్ష్మశరీరము

### ఆకాశ పంచకము - అంతరేంద్రియములు

ఆకాశము రెండు భాగంబులై అర్థాంశము తన నిజాంశములో యుండుటచేత (జ్ఞానమాయెను) మిగిలిన అర్థాంశము నాలుగు భాగంబులై

1వ భాగము వాయువుచేత గూడి - మనస్సాయెను.

2వ భాగము అగ్నిచేత గూడి - బుద్ధాయెను.

3వ భాగము జలముచేత గూడి - చిత్తమాయెను.

4వ భాగము పృధ్విచేత గూడి - ఆహంకారమాయెను.

యివి ఆకాశపంచకమంతరేంద్రియములనబడెను.

1. జ్ఞాతు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అంతరేంద్రియములు అధ్యాత్మలు.
2. యెరుక, చలనము, నిశ్చయము, చింతన, అభిమానము.

ఆది బౌతికములు

3. గురుడు, చంద్రుడు, బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఆది దేవతలు

4. భ్రూమధ్యము, కంఠము, ముఖము, నాభి, హృదయము స్థానములు

5. ఆకాశము, వాయు, అగ్ని, జలము, పృధ్వి, భూతములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆకాశమర్థభాగము | వాయు | అగ్ని | జలము | పృథివి | |
| జ్ఞాతు | మనసు | బుద్ధి | చిత్తము | హంకారం | అధ్యాత్మలు |
| 1/2/3/4 | 1 | 2 | 3 | 4 | |
| యెరుక | చలనము | నిశ్చయము | చింతన | అభిమానం | ఆది,బౌతికములు |
| గురుడు | చంద్రుడు | బ్రహ్మ | విష్ణు | రుద్రుడు | ఆదిదేవతలు |
| భ్రూమధ్యము | కంఠము | ముఖము | నాభి | హృదయము | స్థానములు |
| ఆకాశము | వాయు | అగ్ని | జలము | పృథివి | భూతములు |

## వాయు పంచకము - ప్రాణేంద్రియములు

వాయువు రెండు భాగంబులై అర్ధాంశము తన నిజాంశమందుండుచే (వ్యానవాయువాయెను) మిగిలిన వ్యష్టి అర్ధాంశం నాలుగు నాలుగు భాగంబులై॥

1వ భాగము ఆకాశముచేత గూడి సమాన వాయువాయెను.

2వ భాగము అగ్నిచేత గూడి ఉదానవాయువాయెను.

3వ భాగము జలముచేత గూడి ప్రాణవాయువాయెను.

4వ భాగము పృథివిచేత గూడి అపానవాయు వాయెను.

యివి వాయు పంచకప్రాణేంద్రియము లనబడును.

1. సమానము, వ్యానము, ఉదానము, ప్రాణము, అపానము, అనునవి

## ప్రాణేంద్రియములు అధ్యాత్మలు

2. పచన, స్పర్శ, వచన, శ్వాస, విసర్జన, అది భౌతికములు

3. జయుడు, విశ్వయోని, అజుడు, విసిష్టుడు, విశ్వకర్త అదిదేవతలు

4. నాభి, మేను, కంటము, హృదయము, గంధము స్థానములు

5. కాశము, వాయు, అగ్నిజలము, పృథివి భూతములు

## వాయుపంచీకరణ

| ఆకాశము | వాయువర్థభాగము | అగ్ని | జలము | పృథివి | |
|---|---|---|---|---|---|
| సమానము | వ్యానము | వుద్నాము | ప్రాణము | అపానము | అధ్యాత్మలు |
| 1 | 1/2/3/4 | 2 | 3 | 4 | |
| జయుడు | విశ్వయోని | అజుడు | విసిష్టుడు | విశ్వకర్త | అదిదేవతలు |
| నాభి | మేను | కందము | హృదయము | గుధము | స్థానములు |
| ఆకాశము | వాయువు | అగ్ని | జలము | పృథివి | భూతములు |

## అగ్నిపంచకము - జ్ఞానేంద్రియములు

అగ్ని రెండు భాగంబులై అర్థాంశు సమిష్ఠి తన నిజాంశములో యుండుట చేత (చక్షువాయెను) మిగిలిన వ్యష్ఠి అర్థాంశము నాలుగు భాగంబులై...

1వ భాగము ఆకాశముచేత గూడి శ్రోత్రమాయెను.

2వ భాగము వాయువు చేత గూడి త్వక్కువాయెను.

3వ భాగము జలము చేత గూడి జిహ్వమాయెను.

4వ భాగము పృథివి చేత గూడి ఘ్రాణమాయెను.

యివి అగ్నిపంచక జ్ఞానేంద్రియములనబడును.

1. శ్రోత్రము , త్వక్కు,జిహ్వ, చక్షువు ఘ్రాణము లనునవి అయిదు.

అధ్యాత్మలు, జ్ఞానేంద్రియములు.

2. శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము, ఆదిభౌతికములు

3. దిక్కులు, వాయువు, రవి, వర్ణుడు, అశ్వినీలు ఆదిదేవతలు

చెవులు, తోలు, కండ్లు, నాలుక, ముక్కు స్థానములు

ఆకాశము , వాయువు, అగ్ని, జలము, పృథివి భూతములు

## అగ్ని పంచకము

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆకాశము | వాయువు | అగ్నిఅర్ధభాగము | జలము | పృథివి | |
| శ్రోత్రము | త్వక్కు | చక్షువు | జిహ్వ | ఘ్రాణము | అధ్యాత్మలు |
| 1 | 2 | 1/2/3/4 | 3 | 4 | |
| శబ్దము | స్పర్శ | రూపము | రసము | గంధము | ఆదిభౌతికములు |
| దిక్కు | వాయువు | రవి | వరుణుడు | అశ్వినీలు | ఆదిదేవతలు |
| చెవులు | తోలు | కండ్లు | నాలుక | ముక్కు | స్థానములు |
| ఆకాశము | వాయు | అగ్ని | జలము | పృథివి | భూతములు |

## జలపంచకము - విషయేంద్రియములు

జలము రెండు భాగంబులై అర్ధాంశము సమిష్ఠి తన నిజాంశములో యుండుట చేత (రసమాయెను) మిగిలిన వ్యష్ఠి అర్ధభాగము నాలుగు భాగంబులై...

1వ భాగము ఆకాశముచేత గూడి శబ్ధమాయెను.

2వ భాగము వాయువుచేత గూడి స్పర్షమాయెను.

3వ భాగము అగ్నిచేత గూడి రూపమాయెను.

4వ బాగము పృథివి చేత గూడి గంధిమాయెను.

యివి జలపంచక విషయేంద్రియములనబడును.

1. శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము
విషయేంద్రియములు — అధ్యాత్మికములు

1. వినుట, పాకుట, చూచుట, పెరుగుట, గ్రహించుట — అదిభౌతికములు
2. సదాశివుడు, ఈశ్వరుడు, రుద్రుడు, విష్ణువు, బ్రహ్మ — అది దేవతలు
3. చెవులు, తోలు, కండ్లు, నాలుక, ముక్కు — స్థానములు
4. ఆకాశము, వాయు, అగ్ని, జలము, పృథివి — భూతములు

## జలపంచకము

| ఆకాశము | వాయువు | అగ్ని | జలముఅర్ధభాగము | పృథివి | |
|---|---|---|---|---|---|
| శబ్దము | స్పర్శ | రూపము | రసము | గంధము | అధ్యాత్మలు |
| 1 | 2 | 3 | 1/2/3/4 | | |
| వినుట | పాకుట | చూచుట | పెరుగుట | గ్రహించుట | ఆదిభౌతికములు |
| సదాశివుడు | ఈశ్వరుడు | రుద్రుడు | విష్ణు | బ్రహ్మ | ఆదిదేవతలు |
| చెవులు | తోలు | కండ్లు | నాలుక | ముక్కు | స్థానములు |
| ఆకాశము | వాయు | అగ్ని | జలము | పృథివి | భూతములు |

## పృథివి పంచకము - కర్మేంద్రియములు

పృథివి రెండు భాగంబులై అర్ధాంశము సమిష్ఠి తన నిజాంశములో యుండుటచేత (గంధమాయెను) మిగిలిన అర్ధాంశము వ్యష్ఠి నాలుగు భాగంబులై

పృథివి వ్యష్ఠి 1వ భాగము ఆకాశముచేత గూడి వాక్కు ఆయెను.

పృథివి వ్యష్ఠి 2వ భాగము వాయువు చేత గూడి పాణి ఆయెను.

పృథివి వ్యష్ఠి 3వ భాగము అగ్ని చేత గూడి పాదమాయెను.

పృథివి వ్యష్ఠి 4వ భాగము జలము చేత గూడి గుహ్యామాయెను.

యివి పృథివి పంచక కర్మేంద్రియములనబడును.

1. వాక్కు, పాణి, పాదము, గుహ్యము, గుధము కర్మేంద్రియములు.

ఆద్యాత్మికములు

2. వచనము, దానము, గమనము,ఆ నందము, విసర్జనం ఆది భౌతికములు

3. అగ్ని, యింద్రుడు, విష్ణువు, బ్రహ్మ మృత్యువు ఆది దేవతలు

4. నోరు, చేయి, కాళ్ళు, లింగము, పాయు స్థానములు

5. ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి భూతములు

| ఆకాశము | వాయువు | అగ్ని | జలము | పృథివి అర్థభాగము | |
|---|---|---|---|---|---|
| వాక్కు | పాణి | పాదము | గుహ్యము | గుదము | అధ్యాత్మలు |
| 1 | 2 | 3 | 4 | 1/2/3/4 | |
| వచనము | దానము | గమనము | ఆనందము | విసర్జనము | ఆదిభౌతికములు |
| అగ్ని | ఇంద్రుడు | విష్ణు | బ్రహ్మ | మృత్యువు | ఆదిదేవతలు |
| నోరు | చెయ్యి | కాళ్ళు | లింగము | పాయు | స్థానములు |
| ఆకాశము | వాయు | అగ్ని | జలము | పృథివి | భూతములు |

## పంచీకరణ లక్షణము

సీ. ఆకాశపంచక మంతరేంద్రియములు ప్రాణాదులును వాయుపంచకంబు। జ్ఞానేంద్రియములు వైశ్వా నర పంచక మప్పు పంచకము శబ్ధాదులైదు। కర్మేంద్రియములైదు కడు భూమి పంచకంబిట్టు లిరువది యైదింద్రియములు। యివి యాత్మగాదని యన్నింటినెరిగెడు । యెరుకయే పరమాత్మయని యెరింగి ॥గీ॥

సాంఖ్యయోగంబు సాధించి సజ్జనుండు । ముక్తిజెందును. మీ పాద భక్తితోను ॥ రమ్య గుణధామ ॥

తా. ఆకాశపంచకము : జ్ఞానము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము యీ 5 అంతరేంద్రియములు.

వాయు పంచకము : సమానము, వ్యాసము, ఉదానము, ప్రాణము, అపానము యీ 5 ప్రాణేంద్రియములు.

అగ్నిపంచకము : శ్రోత్రము, త్వక్కు, చక్షు, జిహ్వ, ఘ్రాణము యీ 5 జ్ఞానేంద్రియములు.

జలపంచకము : శబ్ధము, స్పర్శ, రూపము, రసము, గంధము ఈ 5 విషయేంద్రియములు.

పృథివి : వాక్కు, పాణి, పాదము, గుహ్యము, గుధము. యీ 5 కర్మేంద్రియములు

యిన్నిటిని యెరిగిన యెరుకయె పరమాత్మయని తెలుసుకొనుటయె సాంఖ్యము.

1. జ్ఞానము 2. వ్యాసము 3. చక్షువు 4. రసము 5. గుధము అను యీ అయిదు సమిష్ఠింద్రియములు.

1. మనస్సు 2. బుద్ధి 3. చిత్తము 4. అహంకారము 5. సమానము. 6. ఉదానము 7. ప్రాణము 8. అపానము 9. శ్రోత్రము 10. త్వక్కు 11. జిహ్వ 12. ఘ్రాణము 13. శబ్ధము 14. స్పర్శ 15. రూపము 16. గంధము 17. వాక్కు 18. పాణి 19. పాదము 20. గుహ్యము అను యీ యిరువై వ్యష్ఠింద్రియములు.

## పిండాండమందు పంచభూతములు

సీ. జ్ఞానసమానముల్ లీనులు శబ్దంబు। వాగ్వ్యోమయంశముల్ వరుసనాయె। మనసు వ్యానము చర్మమును స్పర్శ కరములు। వాయువాంశంబులు వరుసనాయె। రూఢి బుద్ధియు దాన రూపాక్షి పాదముల్। వహ్ని యంశంబులు వరుసనాయె। చిత్తంబు ప్రాణంబు జిహ్వ శిశ్న రసంబు వారి యంశంబులు వరుసనాయె ॥ గీ॥ గంధహంకారముల పాన ఘ్రాణ గుధము। లాయె భూయంశ లిట్లు నీ మాయవలన ॥ రమ్య ॥

తా. జ్ఞానము, సమాసము, శ్రోత్రము, శబ్ధము, వాక్కు, యీ అయిదు ఆకాశాంశములు. మనస్సు, వ్యాసము, త్వక్కు, స్పర్శ, పాణి అను యీ అయిదు వాయువాంశములు. బుద్ధి , ఉదానము, చక్షు, రూపము, పాదము యీ అయిదు అగ్ని అంశములు.

చిత్తము, ప్రాణము, జిహ్వ, రసము, శిశ్నము యీ అయిదు జలాంశములు,

అహంకారము, అపానము, ఘ్రాణము, గంధము, గుధము ఈ అయిదు పృథివి అంశములు.

1. ఈ జ్ఞాత కూటస్థుడగు ఆదిదేవతచే ప్రేరేపించబడి సమాన వాయువుతో గూడి శ్రోత్రేందియము ద్వారము వలన పరపశ్యంతి మధ్యమ వైఖరి అను చతుర్విధ శబ్దములను గ్రహించి వాక్కుచేత వచించుచుండును. యిది ఆకాశ తత్వ స్థపకము.

2. ఈ జ్ఞాత చంద్రాదిదేవతచే ప్రేరేపించబడి మనోరూపుడై వ్యాన వాయువుతో గూడి త్వగింద్రియ ద్వారము వలన కఠినము శీతలము ఉష్ణము సమశీతలము మృదుత్వము అను పంచ విధ స్పర్శలను గ్రహించి ప్రాణీంద్రియము చేత యిచ్చి పుచ్చుకొనును. యిది వాయు తత్వ స్థపకము.

3. ఈ జ్ఞాత బృహస్పతి ఆది దేవతచే ప్రేరేపించబడి బుద్ధిరూపుడై ఉదాన వాయువుతో గూడి చక్షురింద్రియము ద్వారముచ లన తెలుపు నలుపు పసుపు పచ్చ ఎఱుపు పొట్టి పొడవు సన్నగ, లావుగ మిశ్రమముగా అను దశవిధ రూపములను గ్రహించి పాదేంద్రియము చేత నడుచుచుండును. యిది అగ్ని తత్వ స్థబకము.

4. ఈ జ్ఞాత క్షేత్ర జ్ఞాది దేవతచే ప్రేరేపించబడి చిత్తరూపుడై ప్రాణ వాయువుతో గూడి జిహ్వేంద్రియ ద్వారము వలన వగరు పులుపు చేదు తీపి ఉప్పు కారము చప్పన అను సప్త విధ రసములను గ్రహించి గుహ్యేంద్రియము చేత ఆనందించు చుండును. యిది జలతత్వ స్థబకము.

5. ఈ జ్ఞాత రుద్రాదిదేవత ప్రేరకత్వము వలన అహంకార స్వరూపుడై అపాన వాయువుతో గూడి ఘ్రాణేంద్రియము ద్వారముచేత సువాసన దుర్వాసన మిశ్రమ వాసన అను త్రివిధ గంధములను గ్రహించి పాయువింద్రియము చేత మలమూత్ర శుక్ల శోణితములను విసర్జించును యిది పృథివి త్వస్థబకము.

# ఇరువది అయిదు తత్వములు గూడిన చక్రము

| | ఆకాశ భూతము | వాయు భూతము | అగ్ని భూతము | జల భూతము | పృథివి భూతము | |
|---|---|---|---|---|---|---|
| ఆకాశ తత్వము | జ్ఞానము | మనస్సు | బుద్ధి | చిత్తము | అహంకారము | అంతరేంద్రియములు |
| వాయు తత్వము | సమాన | వ్యాన | ఉదాన | ప్రాణ | అపాన | ప్రాణేంద్రియములు |
| అగ్ని తత్వము | శ్రోత్రము | త్వక్కు | చక్షు | జిహ్వ | ఘ్రాణము | జ్ఞానేంద్రియములు |
| జల తత్వము | శబ్దము | స్పర్శ | రూపము | రసము | గంధము | విషయేంద్రియములు |
| పృథివి తత్వము | వాక్కు | పాణి | పాదము | గుహ్యము | గుధము | కర్మేంద్రియములు |
| | 5 | 5 | 5 | 5 | 5 | |
| | | | 25 | | | |

## స్థూల పంచీకరణి

శృతి అస్థిచర్మ నాడీ రోమమాంసాక్షేతి పృథివ్యంశా : ।
మూత్ర శ్లేష్మరక్త శుక్ల స్వేదా అబంశా: ।
క్షుత్తృష్ణాలస్యమోహమైదు నాన్యగ్నే : ।
ప్రచారణ విలేఖన స్థూలక్ష్యున్మేవ్య నిమేషాదివాయో : ।
కామక్రోధలోభ మోహభయావ్యాకాశస్య : ।

పృథివి :రెండు భాగంబులై అర్థాంశము సమిష్టి తన నిజాంశములో యుండుట చేత (ఎముకలాయెను) మిగిలిన అర్థాంశము వ్యష్టి నాలుగు బాగంబులై

పృథివి వ్యష్టి 1వ భాగము జలముచేత గూడి మాంసమాయెను

పృథివి వ్యష్టి 2వ భాగము అగ్నిచేత గూడి నరములాయెను.

పృథివి వ్యష్టి 3వ భాగము వాయువు చేత గూడి చర్మమాయెను.

పృథివి వ్యష్టి 4వ భాగము ఆకాశముచేత గూడి నఖరోమములాయెను.

(ఎముకలు, రోమములు, చర్మము, నరములు, మాంసము యీ ఐదు పృథివి పంచక స్థూలాంశములనబడును )

జలము : రెండు భాగంబులై అర్ధాంశము సమిష్టి తన నిజాంశములో యుండుటచేత (మూత్రమాయెను) మిగిలిన అర్ధాంశము వ్యష్టి నాలుగు భాగంబులై

జలము వ్యష్టి 1వ భాగము పృథివి చేత గూడి శుక్లమాయెను.

జలము వ్యష్టి 2వ భాగము అగ్నిచేత గూడి రక్తమాయెను.

జలము వ్యష్టి 3వ భాగము వాయువు చేత గూడి చెమటాయెను.

జలము వ్యష్టి 4వ భాగము ఆకాశముచేత గూడి సొల్లు అయెను.

(మూత్రము, శుక్లము, రక్తము, చెమట, సొల్లు యీ ఐదు జలపంచక స్థూలాంశము లనబడును.)

అగ్ని : అగ్ని రెండు భాగంబులై అర్ధాంశము సమిష్టి తన నిజాంశములో యుండుట చేత (ఆకలియాయెను) మిగిలిన అర్ధాంశము వ్యష్టి నాలుగు భాగంబులై

అగ్ని వ్యష్టి 1వ భాగము పృథివి చేత గూడి ఆలస్యమాయెను.

అగ్ని వ్యష్టి 2వ భాగము జలముచేత గూడి సంగమమాయెను.

అగ్ని వ్యష్టి 3వ భాగము వాయువు చేత గూడి దప్పి యాయెను.

అగ్ని వ్యష్టి 4వ భాగము ఆకాశముచేత గూడి నిద్ర అయెను.

(ఆకలి, ఆలస్యము, సంగమము, దప్పి, నిద్ర యీ ఐదు అగ్ని పంచక స్థూలాంశములనందును)

వాయు : వాయువు రెండు భాగంబులై అర్ధాంశము సమిష్టి తన నిజాంశములో యుండుటచేత (మెరుగుట యాయెను) మిగిలిన అర్ధాంశము వ్యష్టి నాలుగు భాగంబులై

వాయువు వ్యష్టి 1వ భాగము పృథివి చేత గూడి సంకోచమాయెను.

వాయువు వ్యష్ఠి 2వ భాగముజలము చేత గూడి చలనమాయెను.

వాయువు వ్యష్ఠి 3వ భాగముఅగ్నిచేత గూడి తిరుగుటాయెను

వాయువు వ్యష్ఠి 4వ భాగము ఆకాశముచేత గూడి దాటుటాయెను.

(ఎరుగుట, సంకోచము, చలనము, తిరుగుట, దాటుట, యీ ఐదు వాయు పంచక స్థూలాంశములనబడును )

ఆకాశము : రెండు భాగంబులై అర్ధాంశము సమిష్ఠి తన నిజాంశములో యుండుట చేత (శోకమాయెను) మిగిలిన అర్ధాంశము వ్యష్ఠి నాలుగు భాగంబులై

ఆకాశము వ్యష్ఠి 1వ భాగము పృథివి చేత గూడి భయమాయెను.

ఆకాశము వ్యష్ఠి 2వ భాగము జలము చేత గూడి మోహమాయెను.

ఆకాశము వ్యష్ఠి 3వ భాగము అగ్ని చేత గూడి క్రోధమాయెను.

ఆకాశము వ్యష్ఠి 4వ భాగము వాయువు చేత గూడి కామమాయెను.

(శోకము, భయము, మోహము, క్రోధము, కామము, అను యీ ఐదు ఆకాశ పంచక స్థూలాంశములనబడును )

## స్థూల పంచీకరణీ చక్రము

| | పృథివి | జలము | అగ్ని | వాయు | ఆకాశము |
|---|---|---|---|---|---|
| పృథివి పంచకము | ఎముక్కలు 1/2/3/4 | మాంసము 1 | నరములు 2 | చర్మము 3 | నఖరోమములు 4 |
| జల పంచకము | శుక్లము 1 | మూత్రము 1/2/3/4 | రక్తము 2 | చెమట 3 | సొల్లు 4 |
| అగ్ని పంచకము | ఆలస్యము 1 | సంగమము 2 | ఆకలి 1/2/3/4 | దప్పి 3 | నిద్ర 4 |
| వాయు పంచకము | సంకోచము 1 | చలనము 2 | తిరుగుట 3 | ఎరుగుట 1/2/3/4 | దాటుట 4 |
| ఆకాశ పంచకము | భయము 1 | మోహము 2 | క్రోధము 3 | కామము 4 | శోకము 1/2/3/4 |

# పంచభూతాంశ గుణములు

సీ. నరములస్థులు చర్మనఖరోమ మాంసముల్ । భూగుణంబులు స్వేద మూత్ర శ్లేష్మ। ములు శుక్ల శోణి తంబులు జల గుణములు । క్షుత్పిపాసాలస్య సుప్తిసంగ। ములు వహ్ని గుణములు చలన ధావన కంప । నాకుంచన ప్రసరణాదికములు । పవనాది గుణములు భయకామ మోహముల్ క్రోధలజ్జలు నభోగుణములిట్టి॥గీ॥ పంచభూతాంశ గుణముల బాదోలి నీ స్వరూపంబుగనువాడు నిర్మలుండు ॥ రమ్య॥

తా. నరములు ఎముకలు చర్మము గోళ్లు వెంట్రుకలు మాసంము 5 భూగుణములు

చెమట, మూత్రము, రక్తము, శుక్ల శోణీతము లైదు జలగుణములు

ఆకలి, దప్పి, ఆలస్యము, నిద్ర, సంగమము ఈ ఐదు అగ్నిగుణములు

పరుగుట, తిరుగుట, ముడుచుట, చాచుట, దాటుట యీ ఐదు వాయు గుణములు.

కామము, క్రోధము, లోభము, మోహము, భయము ఈ అయిదు ఆకాశ గుణములు.

ఈ యొక్క ఆత్మయే సూత్రాత్మగా పరిగణించి యీ ఆత్మ అనాత్మ సంబంధమైన విశ్వరూపము నందున్న మానవులుమంత్రోపాసనలతో చేరిరి.

మంత్రోపాసనయందు అహంకారసంబంధమైన అభిమానము వీడనందున భక్తిలో ప్రవేశించిరి. ఈ భక్తుల భక్తి పద్ధతియందు చిత్త సంబంధమైన చింతన వీడ నందున మతములలో ప్రవేశించిరి. మత పద్ధతి యందు బుద్ధి సంబంధమైన నిశ్చయ జ్ఞానము కలుగనందున యోగభ్యాసములో ప్రవేశించిరి. యోగభ్యాసపద్ధతియందు మనస్సుకు సంబంధమైన సంకల్పములు వీడనందున తత్వ విచారణలో ప్రవేశించిరి. తత్వ విచారణయందు జ్ఞాన సంబంధమైన విమర్శనాత్మకమైన గుర్తింపు కలుగనందున గురుమూర్తిని వేడుకొన వలసి వచ్చెను. ఆ యొక్క గురుమూర్తి ద్వారా ఆత్మను తెలిసికొన్న వారు మానవ దేవతలు ఈ మానవ దేవతలకే తురీయం. ఒకే అవస్థ. తురీయం అధోముఖంగా అంతరేంద్రియములు, ప్రాణేంద్రియములు.

జ్ఞానేంద్రియములు, విషయేంద్రియములు, కర్మేంద్రియముల ద్వారా జాగ్రత స్వప్న శుషుప్తి జరుగుచుండును.

అద్యాత్మికము, ఆదిభౌతికము, ఆది దైవికము, స్థానములు.

భూతములను నమ్మితే మానవ పశుత్వము వచ్చును. ఈ మానవులు ఆకాశము వాయువు, అగ్ని, జలము , పృద్వి యిదియే శ్రేష్టములని నమ్మితే మానవ రాక్షసత్వము వచ్చును. కావున నిరామయుడైనట్టి కేవల పరమాత్మడుగు గురుమూర్తిని నమ్మి చతుర్విధ శుశ్రూషలు యొనర్చి సాదన చతుష్టయములు యొనర్చినచో గురుడు కరుణామయుడై ముముక్షత్వ లభింపజేయును.

## పంచకోష నిర్ణయము

సీ. అన్నరసంబుతో నైన శోణిత శుక్లమయమైన యీ దేహమన్నమయము । పంచ ప్రాణంబులు ప్రబలి కర్మేంద్రియ పంచకంబును గూడి ప్రాణమయము । జ్ఞానేంద్రియములైదు మానసంబొక్కటి కూడియైనది మన: కోశమయము । చెలగి జ్ఞానేంద్రియంబులు బుద్ధియును గూడి విజ్ఞానమయము య విద్యయందు ॥ గీ ॥ మనసు గలిసిన యానందమయము లిట్లు । పంచకోశంబుల సాక్షి పరుడవీవె ॥రమ్య॥

తా. అన్నరసము తోనైన దేహము అన్నమయము । ప్రాణేంద్రియములును కర్మేంద్రియములును గూడి ప్రాణమయము । జ్ఞానేంద్రియములును మనస్సును గూడి మనోమయము । జ్ఞానేంద్రియములును బుద్ధియును గూడి విజ్ఞానమయము। ప్రకృతి యందు మనసు లీనమౌట ఆనందమయము.

## పంచప్రాణముల నిర్ణయము

సీ. ప్రాణుండు హృదయాబ్జ పదమందువాసమై నాణెపు శ్వాసముతొ నడుపుచుండు ప్రాయు పన్దలయందు పానుండు మల మూత్రముల విసర్జనజేసి మెలగియుండు ।నాభియందున సమానము యుండి సమముగా నాళ్ళ నన్నంటిని నడుపుచుండు । ఘన యుధానుండును. కంఠమందున నుండి నల

వైఖరీ పలుకుబలుకజేయు॥ గీ ॥ వ్యానపవనంబు దేహసర్వాంగములను నిండి శీతోష్ణస్పర్శల నెఱుగజేయు ॥ రమ్య॥

తా. సమానము నాభియందుండి నాళ్ళ కన్న రసము బంచును. వ్యానము సర్వాంగము లందు నిండి శీతోష్ణముల నెరిగించును. ఉదానము కంఠమందుండి పలికించును. ప్రాణము హృదయ మందుండి శ్వాస ఉచ్ఛ్వాసలు నడుపును. ప్రాణ వాయువు మూలాధారము నంఉడి "ఓం" అని వెళఖ్ళ నాభిచక్రమందు ॥హం" అని తాకిసం అని కపాలం ముట్టి ముక్కు కుడిద్వారము నుండి 12 అంగుళాలు బయటికి వెళ్ళి 4 అం.ల ప్రమాణము బాహ్యము నందు లయమై 8 అం.ల ప్రమాణము తిరిగి లోపలికి పోయి కనుబొమ్మల నడుమగా నిలుచును. ఈ ప్రకారము రాత్రి పగలు 60 ఘ.లకు 21 వెయ్యి 6 నూర్లు (21600) శ్వాసలు నడుచును. అందులో (7400) శ్వాసలు నష్టమై పోవును మిగిలిన (14200) శ్వాసలు నిలుచును. అందున ఆయువు క్షీణించును. అపానము పాయుస్థలమందుండి మలమూత్రములు వెళ్ళజేయును.

## ఉపవాయువులు

సీ. నాగుండు యుద్గారణంబు చేయించును । మేలుగా కూర్మడు న్మీలనంబు । చేయించుక్రకురుండు చేరి తుమ్మించును. జితదేవదత్తుండు జ్రుంభణంబు । మరణ దేహములందు మరిగి ధనుంజయుండతి శోషబుట్టించి యనగ జేయు। ఘనముగాంతర్యామి యును ప్రపంచకుడును వాయువులో నరునకు వాహనముగ ॥ గీ ॥ యుండు వజ్రుండు ముఖ్యుండు యొనరుగాను । కీళ్ళు కీళ్ళందు నుండును చీల పగిది ॥ రమ్య ॥

తా. నాగవాయువు : ఆవలింపజేయును. పీతవర్ణము చలనము లేక గీతరాగాదులను చేయించును. కోమనాడులయందుండును.

2. కూర్మవాయువు : ఉన్మీలనము చేయును. శ్వేతవర్ణము పాదముల యందుండి శుష్కమైన దేహమును పుష్ఠి చేయించును. కన్నులు నోరు మూయించును తెరిపించును. రక్తమై యుండును.

3. కృకుర వాయువు : తుమ్మించును. రక్తవర్ణము, నాసికాగ్రమందుండి క్షుదాధి ధర్మములను బుట్టించును. గమనాగమనములు చేయించును.

4. దేవదత్త వాయువు : స్పటిక వర్ణము. ఒడలు విరిపించును. గుహ్యానేత్రమందుండి కూర్చుండిన చోటనే పరుండబెట్టును. మేల్కొంచును లేక నిలబెట్టును. వ్యక్తముగా, మాటలాడించును.

5. ధనుంజయవాయువు : నీలవర్ణము, చచ్చిన దేహమును వాచజేయును. బ్రహ్మ స్థానమందుండి కర్ణరంధ్రముల లోకి ప్రవేశించి సముద్రభంగి చిత్రవిచిత్రముగా ఘోషించును. మరణ కాలమునకు ముందుగా నిర్ధోశమైపోవును.

6. అంతర్యామి 7. ప్రపంకుండ నరునకు వాహనము 8వ బ్రుండు 9. ముఖ్యుండు చీలవలె కీళ్ళయందుండును.

## సప్త ధాతువుల లక్షణము

సీ. మరి రసరుధిరముల్ మాసంము మేదస్సు మజ్జాస్థి రేతముల్ మానితముగ । నివిసప్తధాతువుల్। నిబిడీకృతంబుగా దేహికావరణమై దేహమాయె। పాదాది మస్తక పర్యంతమును నిండి ప్రకృతి బేధంబుల ప్రబలమాయె । స్థూలమై దీర్ఘమై సూక్ష్మమైనటియించి నెందెందు మరణంబు వొందుచుండు ॥ గీ ॥ నిట్టి దేహంబులందాస లేమి లేక । నిన్ను గనువాడు మునిజనసన్నుతుండు ॥రమ్య॥

తా. రసము రుధిరము మాంసము మేధస్సు మజ్జ అస్థి రేతస్సులు యివి సప్తధాతువులు. గూడి దేవికి ఆవరణములైన దేహమయ్యి అపాదమస్తక పర్యంతము నిండి ప్రకృతి బేధములచేత పరిణమించి స్థూలముగాను దీర్ఘముగాను నటియించి అచ్చటచ్చట మరణము జెందుచుండును. కనుక యిటువంటి దేహములందు భ్రాంతిని విడువ వలెను.

1. రసము : కపిలవర్ణము, పృథివాంవము , శరీరము దిగులు పుట్టించును.

2. రుధిరము : నీలవర్ణము, జలాంశము, శరీరమును వణికించును.

3. మాంసము : రక్తవర్ణము, అగ్న్యాంశము శరీరము గుబులు పొడిచి కంపరము బుట్టించును.

4. మేధస్సు : మంజిష్ఠ వర్ణము వాయువాంశము శరీరము చేధించి కంపము పుట్టించును.

5. మజ్జ : కృష్ణవర్ణము ఆకాశము మొరాలించి మాట్లాడించును. గానమునందు ప్రేమ పుట్టించును.

6. అస్థి : తామ్రవర్ణము, సూర్యాంశము శరీరమందు హుగ్రమెత్తించి తేజస్సు పుట్టించును.

7. రేతస్సు : శ్వేతవర్ణము చంద్రాంశము శరీరము పులకలు పుట్టించి చింత పుట్టించును.

## ప్రకృతి భేధంబులు

1. భూమి : పసుపు వర్ణం పిక్కలయందుండును.
2. జలము : తెలుపువర్ణం తొడల యందుండును.
3. అగ్ని: యెరుపువర్ణం కడుపు యందుండును.
4. వాయువు : దూమ్రవర్ణం కంఠమందుండును.
5. ఆకాశము : నీలవర్ణం ముఖముయందుండును.

## శరీర త్రయము

సీ. జ్ఞానేంద్రియంబులు కర్మేంద్రియములంత। రింద్రియంబులు విషయేంద్రియములు। ప్రాణాదులను గూడి పరగ నిరువది యైదు తత్వంబులను స్థూల తనువునయ్యె। బాహ్యేంద్రియంబులు పదిప్రాణములు నైదు। ధీ మనంబులు సూక్ష్మ దేహమయ్యె। యీ శరీర ద్వయ హేతుకా నాద్య విద్యావృతమై కారణాంగమయ్యే ॥ గీ ॥ మూడు దేహంబులకు నాదిమూలమైన । క్షరున కక్షరునకు విలక్షణుడవీవే ॥రమ్య ॥

లా. జ్ఞానేంద్రియములు 5 కర్మేంద్రియములు 5 అంతరింద్రియములు 5 ప్రాణేంద్రియములు 5 విషయేంద్రియములు 5. యీ 25 తత్వములు గూడి స్థూల శరీర మాయెను. వీనికే విశ్వుడని పేరు.

జ్ఞానేంద్రియములు 5 కర్మేంద్రియములు 5 . ప్రాణేంద్రియములు 5 మనస్సు. బుద్ధి . చిత్తము, జ్ఞానముతో గూడి 19 యీ పందొమ్మి తత్వములతో కారణ శరీరమాయెను. దీనికే ప్రాజ్ఞుడని పేరు.

యీ మూడు శరీరములకు విలక్షణమైనది. ఆత్మయని యెరుంగవలయును.

## 1. స్థూలదేహ లక్షణం

స్థూలదేహము నేత్రస్థానము (అకార మాతృక) తామ్రవర్ణం। సర్వవ్యాపారం। ఋగ్వేదం. । విశ్వుడభిమాని । రజోగుణం । భూతత్వం । దృశ్యరూపం । స్థూలభోగం । విపరీత జ్ఞానం । వైఖరీ వాక్కు । సార్థ త్రయహస్త (3 1/2 అం.) జాగ్రదావస్థ । పంచభూతమయం । పంచవింశతి తత్వాత్మకం । ప్రత్యేక భూమి కళలు 1 ఉత్పత్తి । జాగ్రత । బోధ । వ్యావృతి । యీ నాల్గు కళలు ।7

## 2. సూక్ష్మదేహ లక్షణం

సూక్ష్మదేహం । అపంచీకృతం । కంఠస్థానం । సత్వగుణం । (ఉకార మాతృక) స్వప్నావస్థ అన్యదాజ్ఞానం । అపःతత్వము । శుక్లవర్ణం । దృష్టరూపం । మధ్యమవాక్కు । యజుర్వేదం । మనోవికారం । అంగుష్ఠ మాత్రం । (1 అం.) తైజసుడభిమాని । ప్రవిక్త భోగం । ప్రత్యేకం జలకళలు । సాదృశం । అసాదృశం। యాదృశం । తాదృశం । యీ నాల్గు కళలు.

## 3. కారణదేహలక్షణం

కారణదేహం । హృదయస్థానం । తమోగునం । ప్రాజ్ఞుడభిమాని । ఆనందభోగం । (మకార మాతృక) సుషుప్తవస్థ । అజ్ఞాన జ్ఞానం । తేజస్థత్వం । దృష్యరూపం । కృష్ణవర్ణం । అంగుష్ఠార్థ ప్రమాణం (1/2 అం.) పశ్యంటివాక్కు । సామవేదం । తేజో

మండలం। ప్రత్యేక అగ్నికళలు। మరణం। విస్మృతి। మూర్ఛ। నిద్రా। యీ నాల్గు కళలు ॥

## 4. మహాకరణ దేహ లక్షణం

మహాకారణ దేహము । సగుణం। త్రప్యగ్మా । మూర్ధిస్థానం । వైభోగిక భోగం । తూర్యావస్థ (అర్థమాతృక) వివేక జ్ఞానం। దృష్ట రూపం। వాయు తత్వం। నీలవర్ణం। మసురామాత్ర ప్రమాణం (1/4 అంగుళము) అధర్వణ వేదం । పరావాక్కు । వాయుమండలం। ప్రత్యేక వాయుకళలు। వైరాగ్యం। ముముక్షత్వం। ఆత్మత్వం। పదదర్శనం। తూర్యావస్థ। 5, క్రైవల్య దేహము। ఆకాశ, వాయు, అగ్ని, జల పృధ్విలీల సూచనలు . అద్వితీయమందు కనగల్గ చెప్పినారము యిది అనుభవ నీయకము.

## పిండ బ్రహ్మాండ విచారణ

పిండోత్పత్తి :

జీవుండు తన కర్మవ శాత్తుచే మానవ జన్మనెత్తుటకై స్వర్గ నరక విముక్తి బొంది కొంతకాలము ఆకాశవీధిని దిరుగుచుండ। అంతటచంద్ర మండలము జొచ్చి ఆ చంద్రుని యొక్క హిమంబునకు ఓర్వలేక మరికొంత కాలమునకు సూర్యమండలము ప్రవేశించి ఆ సూర్యునియొక్క వేడిమికి తాళలేక బహు తపించుచు మరికొంతకాలమునకు మంచుబిందువులో ప్రవేశించి ఆ మంచునకు సహింపలేక శ్రమలనోబడుచు మరికొంతకాలమునకు మేఘమండలములో ప్రవేశించి వర్షబిందువుల ద్వారా భూమి మీదను బడి సస్యరూపముగా జనించి పిమ్మట ధాన్యరూపంబై ఆ ధాన్యంబు అన్నంబై ఆ అన్నంబు పురుషునికి బోజ్యంబై ఆపురుషుని జఠరాగ్ని చేత పచనంబై రసంబుగును. ఆ రసంబు 7 రోజులకు రక్తంబగును. ఆ రక్తంబు 7 రోజులకు మాంసం బగును. ఆ మాంసంబు 7 రోజులకు మెదడగును. ఆ మెదడు 7 రోజ ఎముకలగును. ఆ ఎముకలు 7 రోజులకు మజ్జ యగును. ఆ మజ్జ 7 రోజులకు శుక్లంబగును. ఆ శుక్లంబు పురుషుని గర్భములో 3 మాసములుండి అంతట ఆ పురుషుండు స్త్రీ సంగమం జేయగ ఆ స్త్రీ గర్భములో

ప్రవేశించి శోణితము తోడన్ గలిసి ఒక రాత్రికి చింతపండు గలిపిన నీటివలె చిక్కనై యుండును. చిక్కనై యుండిన 5 రోజులకు నీటిమీద బొడిమిన బుగ్గవలె నుండును. 10 రోజులకు రేగుపండు రీతిగ నుండును. 1 మాసమునకు శిరస్సు యేర్పడును. 2మాసములకు కరచరణములు గలుగును. 3 మాసములకు చర్మము గోళ్ళు వెంట్రుకలు నవరంధ్రములేర్పడును.

4 మాసములకు సప్తధాతువులేర్పడును. 5 మాసములకు ఆకలి దప్పులు యేర్పడును. 6 మాసములకు తల్లి గర్భమున దక్షిణ భాగము దిరుగుచు మాతృభుక్తి అను పానము వలన తృప్తి బొందును. దైవకృతంబైన జ్ఞానంబున పూర్వ కృతంబైన దు:కంబులను దలచుచు దీర్ఘాలోచనుండై యుండును. 7 మాసములకు కృతాంజలుండై తానెవ్వరి చేత సీష్టింపబడెనో నట్టి సర్వేశుని స్మరింపు చుండును.

8 మాసములకు దేహ విమోహితుండు గాక జీవుండు గర్భము నందు దు:ఖింపుచుండును. 9 మాసమున యీ ఆత్మను రక్షించుకొందునని నిశ్చయ మనస్సుగల వాడై జీవుండు గర్భము నుండి వెడల జాలక ప్రారబ్ధంబున నధోముఖంబున భూమి మీదన బడును. మల విక్షేపావరణములచే జనన మరణావస్థలు జెందుచుండును.

బ్రహ్మాండ విచారణ :

1. పీత : తెల్ల గుడ్డు చుట్టూ ఉండేది. (ఎర్రగుడ్డు) ఇదియే పృధివీతత్వము। క్రియాశక్తి। బ్రహ్మ ఆది దేవత। ఆకార మాతృక అన్నమయకోశము సద్యోజాత ముఖ్యము.

2. శుక్ల : (తెలుపు ) తెల్లగుడ్డు యిదియే అపోతత్వం (జలతత్వం) జ్ఞానశక్తి , విష్ణువు ఆది దేవత ఉకార మాతృక ప్రాణమయ కోశము . వామదేవ ముఖము.

3. కృష్ణ (నలుపు) నల్లగుడ్డు యిదియే అగ్నితత్వము. ఇచ్ఛాశక్తి రుద్రుడది దేవత. మకార మాతృక మనోమయ కాశము. తత్పురుష ముఖము.

యీ మూడు అండములు పిండాండము జీవోహము అనగా నేను జీవుడననే అహంకారము.

1. నీల (కన్రెది) సునీలము నల్లగుడ్డు మధ్య వుండే బిందువనే పాప. ఇదియే వాయుతత్వము. ఆదిశక్తి (ఇంద్రుడు) ఈశ్వరుడదిదేవత. అర్థమాతృక విజ్ఞానమయ కోశము. అఘోర ముఖము.

2. ఇంద్రనీలము (పులుగు, హంస) ఆపాప మధ్య వెలగే కళ । ఇదియే ఆకాశ తత్వము. పరాశక్తి (సూర్యుడు) సదాశివుడు ఆది దేవత , ఓంకార మాతృక । ఆనందమయ కోశము. ఈశాన్య ముఖము.

యీ రెండు అండములు బ్రహ్మాండము , శివోహము అనగా నేను శివుడ (లేక ఆత్ముడ)ననే అహంకారము.

నల్లగుడ్డునకే అదాండమనియు గంగయనియు చంద్రమండలమనియు నాదమనియు ఇడాయనియు కామాక్షియనియు స్థూలదేహమనియు పంచభూతములనియు (హ, య, ర, వ, ల) అక్షరములనియు సొంజ్ఞ.

నల్లగుడ్డు మధ్యవుండే పాపకే పిండాండమనియు సూర్యమండలమనియు బిందువనియు, పింగళి యనియు మీనాక్షియనియు, నీలతోయద మధ్యస్తమనియు, సూక్ష్మదేహమనియు, స్వప్నావస్థయనియు, రజోగుణమనియు, మిశ్రమ మాయ యనియు, జీవుండనియు సొంజ్ఞ.

ఆ బిందుమధ్యను వెలిగే కళకే బ్రహ్మాండమనియు సరస్వతి యనియు అక్షరమనియు అగ్నిమండలమనియు, కళా స్వరూపిణి యనియు, సుషుమ్నయనియు, విశాలాక్షి యనియు, ఆకాశ తత్వమనియు , విద్యుల్లేయనియు, కారణ శరీరమనియు, మహాకరణ శరీర మనియు సుషుప్త్యవస్తయనియు । తుర్యావస్తయనియు ఓంకారమను అక్షర మనియు శుద్ధ మాయ యనియు సాత్విక గుణమనియు పంచశక్తులనియు (క, ఏ, ఈ, ల హం) అక్షరములనియు పంచ బ్రహ్మలనియు (య, వ, శి, మ, న) అక్షరము లనియు సొంజ్ఞ.

ఈ యెరుకయగు కళకే ఆకాశ తత్వమనియు ప్రణవాక్షరమనియు రక్త శ్వేత కృష్ణ నీల వర్ణముల మధ్య ప్రకాశించెడి ఆపోజ్యోతి యనియు నీలతో యద మధ్యస్తమైన విద్యుల్లేఖయనియు । మేరు శిఖరమనియు బ్రహ్మరంధ్రమనియు, స్వయం జ్యోతి యనియు , సర్వసాక్షి అనియు మదహంకారమనియు । మూలజ్ఞన మనియు । గగన ముద్రయనియు అనేక వర్ణ గుణనామాదులతో నుండినది గుర్తెరిగి శరీరము ఇది నివృత్తి చేయుటకే గురుడు అవసరము. శాస్త్రములచేత సాధ్యమయ్యేది కాదు. సాధనలచేతను సాధ్యంకాదు.

# షోడశకళ (అవస్థల) వివరము

1. జాగ్రత్తలో జాగ్రతయన గురుసాన్నిధ్యమున శాస్త్రములను వినునపుడు వాటి యందున్న విషయములను మరుపు లేక సందియముల నెరిగించి తెలుసుకొని మరువ కుండుట.

2. జాగ్రతలో స్వప్నమన గురుసాన్నిధ్యమున శాస్త్ర విషయములను వినియు పరాకు పడుటచే ఆ విషయములు జ్ఞాపకముండియు నుండక పోవుట.

3. జాగ్రతలో సుషుప్తియన గురుసాన్నిధ్యమున మంచి విషయములను వినవలెనని ప్రారంభించి వినునప్పుడు హెచ్చరిక లేమిచే ఆ విషయములు కొంచమేనియు జ్ఞాపకము లేకపోవుట.

4. జాగ్రతలో తుర్యమన గురుని వద్ద శాస్త్ర శ్రవణము చేసి వస్తు తత్వ జ్ఞానము గలిగి ఆ వస్తువును చింతించుట.

5. స్వప్నములో జాగ్రతయన కలగాంచి లేచి తాను గన్న స్వప్నము నంతయు తప్పక చెప్పుట.

6. స్వప్నములో స్వప్నమన కలగని లేచియందలి విషయములను మరిచియు మరువకుండుట.

7. స్వప్నములో సుషుప్తియన కలగాంచి మేల్కొని కలయందు తాను గన్న దంతయు మరచుట.

8. స్వప్నములో తుర్యమన తాను కలలో కొండనెక్కి నట్లును ఏనుగు మీద కూర్చొని నట్లును, లక్ష్మి వచ్చి నట్లును, వచ్చిన స్వప్న ఫలితము తనకు రాజ్యాదికారము వచ్చునని గాని సంపద గలుగునని గాని యెంచక యిదంతయును మనోవ్యాపారమే గాని వేరు కాదని నిశ్చయించి బ్రహ్మ నిష్ఠయందు చలింప కుండుట.

9. సుషుప్తిలో జాగ్రతయన సుఖముగా నిద్రపోయిలేచి, ఆ నిద్రా సుఖమిట్టిదని తెలియ చెప్పుట.

10. సుషుప్తిలో స్వప్నమన సుఖముగా నిద్రించియు దాని వలన సుఖమెట్టిదియో యని తోచీ తోచక యుండుట.

11. సుషుప్తిలో సుషుప్తియన నిద్రపోయి లేచిన పిదప దాని సుఖమిట్టిదని తెలియకుండుట.

12. సుషుప్తిలో తుర్యమన సుఖముగా నిద్రపోయియు, ఆ నిద్రావస్థ అజ్ఞాన విషయము గాని ప్రజ్ఞాన ఘన ప్రత్యగాత్మనైన నా విషయము గాదని తెలియుట.

13. తుర్యములో జాగ్రతయన బ్రహ్మనిష్ఠయందుండి నప్పుడు జాగ్రతయందలి వ్యాపారములగు ఆకలి దప్పులు దోచి ప్రపంచ వృత్తి గలుగుట.

14. తుర్యములో స్వప్నమనబ్రహ్మ నిష్ఠయందుండి నప్పుడు ఆకలి దప్పులు తోచి ప్రపంచ వృత్తి కలిగీ కలుగకుండుట.

15. తుర్యములో శుషుప్తియన బ్రహ్మనిష్ఠయందు వికల్పమేమియు లేకుండుట.

16. తుర్యములో తుర్యమన జాగ్రతస్వప్న సుషుప్తుల వలన గలిగెడి పదిహేనవ స్థల యొక్క బేధములు లేక అఖండ పరిపూర్ణ సచ్చిదానంద పరబ్రహ్మము తానే గాని తనకంటె వెరనెడు వృత్తి లేక పరబ్రహ్మమగు తాను తానై యుండుట.

## బ్రహ్మరంధ్ర స్థాన నిర్ణయము

చెవుల రంధ్రాలు రెండున్ను, కండ్ల రంధ్రాలు రెండున్ను, యెక్కడ కూడియుండునో అదియే బ్రహ్మరంధ్రము. యిదియే శుష/మ్న నాడి దీనినే సకల శాస్త్రములయందు కుండలి స్థానమనిన్ని, త్రివేణి సంగమమని, ద్వాదశాంతమని, చతు:పీఠమని, త్రికూటమని, ముక్తిద్వారమని, బిందు నాద కళాస్థానమని, అహమని, శృంగాటకమని, పూర్ణ శ్మశానమని, మండల త్రయమని, హంసస్థానమని, ఆపజ్యోతి స్థానమని, పరమాత్మ స్థానమని శుషుమ్నానాడికే చెప్పబడుచున్నవి.

| | | | |
|---|---|---|---|
| | ఓం | | |
| | క్షరము | | అక్షరము |
| | అ | వు | మ |
| దీక్షత్రయములు | దృక్‌దీక్ష | స్పర్శదీక్ష | వాక్‌దీక్ష |
| దృష్టిత్రయములు | అంతర్‌దృష్టి | మధ్యదృష్టి | బాహ్యదృష్టి |
| తాపత్రయములు | అధ్యాత్మికము | ఆదిబౌతికము | ఆదిదైవికము |
| యీషణత్రయము | ధారీషణ | ధవీషణ | పుత్రీషణ |
| వాసనత్రయము | దేహవాసన | లోకవాసన | శాస్త్రవాసన |
| గుణత్రయము | సత్వగుణము | రజోగుణము | తమోగుణము |
| వ్యాధిత్రయము | హతము | పైత్యము | శ్లేష్మము |
| మంత్రయము | అణవమలము | మాయామలము | కార్మికమలము |
| నాడీ త్రయము | ఇడ | పింగళ | సుషుమ్న |

# వాక్య చతుష్టయములు

| వాక్య చతుర్థయం | ప్రజ్ఞానంబ్రహ్మ | అహంబ్రహ్మాస్మి | తత్వమసి | అయమాత్మ |
|---|---|---|---|---|
| వర్ణచతుర్థయం | బ్రహ్మ | క్షత్రీయ | వైశ్య | శూద్ర |
| అనుభవచతుర్థయం | స్థూల | సూక్ష్మ | కారణ | మహాకారణ |
| ఆశ్రమచతుర్తయం | గృహస్త్రాశ్రమం | వానప్రస్త్రాశ్రమం | సన్యాసాశ్రమం | బ్రహ్మచర్యం |
| సేవాచతుష్టయం | స్థానసేవ | అంగసేవ | ఆత్మసేవ | భావసేవ |
| సాధన చతుష్టయం | నిత్యానిత్య వివేకము | ఇహమూత్రా ర్థఫలబోగవిరాగం | శమాదిషట్క సంపత్తి | ముముకృత్వం |
| అవస్తా చతుష్టయము | నిద్ర | స్వప్న | జాగ్రత | తూర్యం |
| యామ చతుర్థయం | మొదటజాము | రెండవజాము | మూడవ జాము | నాల్గవ జాము |
| యుగచతుర్థయం | కృతాయుగం | త్రేతాయుగం | ద్వాపరయుగం | కలియుగం |
| ప్రాణచతుర్థయం | అస్తిగతప్రాణం | మాంసగతప్రాణం | చర్మగతప్రాణం | అన్నగతప్రాణం |
| పదవి చతుర్థయం | సాలోక్యపదవి | సారూప్య పదవి | సాయుజ్యపదవి | సామీప్య పదవి |

# పంచాక్షరములు.... పంచ ముద్రలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| పంచాక్షరములు | న | మ: | శి | వా | య |
| పంచమాత్రలు | లం | వం | రం | యం | హం |
| పంచభూతములు | పృథివి | జలము | అగ్ని | వాయు | ఆకాశము |
| పంచమూర్తులు | బ్రహ్మ | విష్ణు | రుద్రుడు | ఈశ్వరుడు | సదాశివుడు |
| పంచశక్తులు | ఆదిశక్తి | పరాశక్తి | యిచ్ఛాశక్తి | క్రియాశక్తి | జ్ఞానశక్తి |
| పంచబ్రహ్మలు | మనుబ్రహ్మ | మయబ్రహ్మ | తష్టబ్రహ్మ | శిల్పిబ్రహ్మ | విశ్వబ్రహ్మ |
| పంచవేదములు | రుగ్వేదము | యజుర్వేదం | సామవేదం | అథర్వణ | ప్రణవవేదం |
| పంచఋషులు | సనాగఋషి | సనాతన | అభువన | ప్రత్యసి | కౌపీర్ణసఋషి |
| పంచశాఖలు | అస్యలాయని | ఆపస్తంభన | కౌష్యాన | బౌద్ధ | కాత్యాయని |
| పంచముఖము | సద్యో | వామదేవ | అఘోర | తృతీయ | ఈశాన్య |
| పంచాగ్నులు | కోపాగ్ని | సీతాగ్ని | క్షుదాగ్ని | కీలాగ్ని | జ్ఞానాగ్ని |
| పంచాకాములు | చతురస్రా | అర్ధచంద్రా | త్రికోణ | షట్కోణ | వృత్తాకారము |
| పంచవర్ణములు | అసిత | శుభ్ర | రక్త | ధూమ్ర | సునీలవర్ణం |
| పంచతనాత్రలు | గంధ | రస | రూప | స్పర్శ | శబ్ధ |
| పంచభూతస్థానం | గుధము | లింగస్థా | నాభి | హృదయ | శిరస్సు |
| జ్ఞానేంద్రియములు | ఘ్రాణేంద్రి | జింహ్మ | చక్షురింద్రి | తృగింద్రి | శోత్రేంద్రియం |
| ఖర్మేంద్రియములు | పానీ | గుహ్యే | పాదేంద్రి | పాణేంద్రి | వాగీంద్రియం |
| పంచకోషములు | అన్నమయకోశం | ప్రాణము | మనోమయ | విజ్ఞానము | ఆనందమయరో |
| పంచప్రాణములు | అపానవా | ఉదానవా | ప్రాణ | వ్యాన | సమానవాయు |
| విషయేంద్రియములు | గంధము | రసము | రూపము | స్పర్శ | శబ్దము |
| పంచముద్రలు | ఖేచరి | భూచరి | మద్యము | షణ్ముఖి | శాంభవి |
| పంచావస్తలు | జాగ్రత | స్వప్న | సుషుప్తి | తూర్య | తూర్యాతీతము |
| పంచమలములు | కార్మిక | మాయా | మాయేయ | తిరోదాన | అణవమలము |

# షడ్భావములు వివరణము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| షడ్గుణములు | శాంతము | సత్యము | దయ | ఓర్పు | న్యాయము | శీలము |
| షట్చక్రములు | ఆధారము | స్వాదిష్టము | మణిపూరకము | అషహతము | విశుద్ధము | ఆగ్నేయము |
| షడర్మ్ములు | ఆకలి | దప్పి | శోకము | మోహము | జననము | మరణము |
| షడ్రుచులు | తీపి | పులపు | కారము | వగరు | చేదు | ఉప్పు |
| షట్కసంపత్తి | శమము | దమము | తితీక్ష | ఉపరతి | సమాధానము | శ్రద్ధా |
| షణ్మతములు | గాణపత్యము | శాక్తేయము | కపాలి | శైవ | వైష్ణ | బ్రాహ్మణ |

# సప్తావరణ వివరణము

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| సప్తద్వీపములు | జంబూ ద్వీపము | ప్లక్ష ద్వీపము | శాఖ ద్వీపము | శాల్మలీ ద్వీపము | పుష్కర ద్వీపము | కుష ద్వీపము | క్రౌంచ ద్వీపము |
| సప్తస్థానములు | తలలో | ఆస్తులందు | శిరస్సునందు | చర్మమునందు | గోళ్ళయందు | మాంసమునందు | వెంట్రుకలయందు |
| సప్తసముద్రములు | లవణ సముద్రము | ఇక్షు సముద్రము | సుర సముద్రము | సర్ప సముద్రము | దధి సముద్రము | క్షీర సముద్రము | శుద్ధోదక సముద్రము |
| సప్త లక్షణములు | మూత్రము | చెమట | శుక్లము | శోణితము | శ్లేష్మము | జొల్లు | కన్నీరు |
| సప్తధాతువులు | రసము | రుధిరము | మాంసము | మేధస్సు | మజ్జ | అస్థి | రేతస్సు |
| సప్తఊర్ధ్వలోకములు | భూలోకము | భువర్లోకము | సువర్లోకము | మహర్లోకము | జలలోకము | తపోలోకము | సత్యలోకము |
| సప్తస్థానములు | గుధమందు | గుహ్యమందు | నాభియందు | హృదయమందు | కంఠమందు | భ్రూమధ్యమందు | లలాటమందు |
| సప్తఅథోలోకములు | అతల | వితల | సుతల | తలాతల | రసాతల | మహాతల | పాతాళ |
| సప్తస్థానములు | అరికాళ్ళయందు | మోగాళ్ళయందు | మెడిమెలయందు | పిక్కలయందు | మోకాళ్ళయందు | తొడలయందు | కటియందు (నడుమ) |

# సప్త చక్రాత్మక చక్రము

| చక్రములు | మూలాధారము | స్వాధిష్ఠము | మణిపూరము | అనహాతము | విశుద్ధము | అజేయము | సాహస్రారము |
|---|---|---|---|---|---|---|---|
| స్థానము | గుధము | గుహ్యము | నాభి | హృదయము | కంఠము | భ్రూమధ్యం | బ్రహ్మరంధ్రం |
| బీజములు | వ-శ-స-ష | బ-భ-మ-య-ర-ల | డ-ఢ-త-థ-ణ<br>ద-ధ-న-ప-ఫ | క-ఖ-గ-ఘ-ఙ<br>చ-ఛ-జ-ఝ-ఞ<br>ట - ఠ | అ-ఆ-ఇ-ఈ-<br>ఉ-ఊ-ఋ-ౠ<br>ఎ-ఏ-ఒ-ఔ-అం-అ: | హం-క్షం | ఓం |
| నాధములు | కింకిణీనాధము | వీణానాధము | వేణు | శంఖారవము | మేఘనాధము | అబ్ధి | ఝుంకార |
| శక్తులు | క్రియాశక్తి | ఇచ్ఛాశక్తి | జ్ఞానశక్తి | ఆదిశక్తి | పరాశక్తి | చిచక్తి | సహజాత్మ |
| సంఖ్య | 4 | 6 | 10 | 12 | 16 | 2 | 1 |
| పద్మములు | చతుర్ధళములు | సద్దళములు | దశదళములు | ద్వాదశదళములు | షొడశదళములు | ద్విళములు | సహస్రదళములు |
| వర్ణములు | తప్తకాంచనము | రక్తవర్ణము | పీతవర్ణము | శ్వేతవర్ణము | నీలవర్ణము | మాణిక్యవర్ణము | కోటిసూ.ప్రకా. |
| తత్వములు | పృధివి | జలము | అగ్ని | వాయువు | ఆకాశము | అంత:కరణము | బుద్ధి |
| కారణము | ఘ్రాణము | జంహ్వ | నేత్రము | త్వక్కు | శోత్రము | జాత్ర | ఆత్మ |
| అధిపతులు | విఘ్నేశ్వరుడు | బ్రహ్మ | విష్ణు | రుద్రుడు | జీవాత్మ | పరమాత్మ | గురుమూర్తి |
| హంసజపసంఖ్య | 600 | 6000 | 6000 | 6000 | 1000 | 1000 | 1000 |
| ఘడియలు | 6 AM to | 6.40 Am | 1-20 | 8 PM to | 2.40 AM to | 3.46-40 AM | 4-53-20 to |
| కాల విఘడియలు | 6.40 PM | to 1.20 PM | to 8 PM | 2.40 AM | 3.46-40 AM | to 4.58-20 AM | 6 AM |
| లిప్తలు | 0.40 | 6.40 | 6.40 | 6.40 | 1.6.40 | 1-6-40 | 1-6-40 |

# అష్టావరణ చక్రము

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| అష్టగురువులు | సూచక | వాచక | నిశిద్ధ | బోదక | కారణ | సదమల | సదమ | విహిత |
| అష్టాంగయోగములు | యమ | నియమ | ఆసనము | ప్రాణాయా | ప్రత్యాహారము | ధ్యానము | ధారణ | సమాది |
| అష్టమదములు | కులమధం | భలమధం | ధనమధం | యవ్వన | రాజ్యమధం | రూపమధం | విద్యామధం | తపోమధం |
| అష్టప్రకృతులు | ఆకాశము | వాయు | అగ్ని | జలము | పృథివి | బుద్ధి | మనస్సు | అహంకారం |
| అష్టసిద్ధులు | అణిమ | మహిమ | గరిమ | లఘిమ | ప్రాప్తి | ప్రాకామ్యము | ఈశత్వము | వశిత్వము |
| అష్టపాశములు | తల్లి | తండ్రి | భార్య | తనయులు | మిత్రులు | ధనము | సహోదరులు | తనువు |
| అష్టప్రమాణములు | ప్రత్యక్ష | అనుమాన | ఉపమాన | శబ్దప్రమా | నర్థాపత్తి | యభావ | నైతిహ్య | సంభవ |
| అష్టానందములు | బ్రహ్మానందం | ఆత్మానందం | నిజానందం | వాసనానందం | విషయానందం | ముఖ్యానందం | వి ద్యా న ం ద ం | |
| ఆధ్యాత్మికానందం | | | | | | | | |
| అష్టదిక్కులు | తూర్పు | ఆగ్నేయము | దక్షిణ | నైఋతి | పశ్చిమ | వ్యావము | ఉత్తర | ఈశాన్యము |
| అష్టదిక్పాలకులు | ఇంద్రపురం | అగ్నిపురం | యమపురం | నైఋతిపురం | వరుణపురం | వాయుపురం | కుబేరపురం | శివపురం |
| అష్టస్థానములు | భ్రూమ మందు | కుడికంటి యందు | కుడిచెవి యందు | కుడిపార్శ్వ పృష్ఠమందు | పృష్ఠ మందు | ఎడమపార్శ్వ మందు | కుడిచేయి యందు | ఎడమకంటి యందు |

# జీవేశ్వరుల అష్ఠ తనువుల ప్రశంస

| ఆకాశము అహంకారము | దేహాలు | అవస్థ | అభిమానం | స్థానము | శక్తులు | మాతృక | ఆత్మలు | |
|---|---|---|---|---|---|---|---|---|
| | స్థూలము | జాగ్రత | విశ్వుడు | నేత్రం | క్రియ | అకారం | జీవాత్మ | రాజ |
| పృథివి | విరాట్టు | ఉత్పత్తి | బ్రహ్మ | సూర్యుడు | క్రియ | అకారం | భూతత్మ | హంకారం |
| | సూక్ష్మము | స్వప్నం | తైజసుడు | కంద | ఇచ్ఛ | ఉకారం | అంతరాత్మ | సాత్వికా |
| ఉదకము | హిరణ్యగర్భం | స్థితి | విష్ణు | చంద్రుడు | ఇచ్ఛ | ఉకారం | సూత్రాత్మ | హంకారం |
| అగ్ని | కారణం | సుషుప్తి | పాజ్ఞుడు | హృదయం | జ్ఞానం | మకారం | పరమాత్మం | తామసా |
| | అవ్యాకృతం | ప్రళయం | రుద్రుడు | అగ్ని | జ్ఞానం | మకారం | శుద్ధాత్మ | హంకారం |
| వాయువు | మహాకారణం | తుర్యం | ప్రత్యగాత్మ | మూర్ధ్ని | ద్రవ్యం | ఓంకారం | మహాత్మ | శుద్ధసాత్వికా |

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| నవవిధభక్తులు | కీర్తన | సేవన | శ్రవణ | అర్చన | వందనము | దాస్యము | సక్యము | చింతన | ఆత్మసమర్పణ |
| నవరంధ్రములు | నేత్రములు | చెవులు | ముక్కు | నోరు | శిష్నము | గుధము | | | |
| నవరత్నములు | కెంపు | ముత్యము | పగడము | గోమేధికము | పుష్పరాగము | నీలము | పుచ్ఛ | వైఢూర్యము | వజ్రము |
| నవరసములు | నూనె | నెయ్యి | నువ్వులు | బెల్లము | ఉప్పు | చింతపండు | ఉల్లిగడ్డ | అల్లము | ఎల్లిపాయలు |
| నవగ్రహములు | రవి | చంద్రుడు | కుజుడు | రాహు | కేతువులు | గురువు | శని | బుధుడు | శుక్రుడు |
| నవచక్రములు | ఆధార | స్వాదిష్ఠ | మణిపూర | అనహాత | విశుద్ధ | ఆజ్ఞేయ | సాహస్రా | ఖర్మచక్రం | కాలచక్రం |
| నవఖండములు | | | | | | | | | |
| నవద్రవ్యములు | | | | | | | | | |

109

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| దశవాయువులు | సమాన | వ్యాన | ఉదాన | ప్రాణ | అపాన | నాగ | కూర్మ | కృకూర | దేవదత్త | ధనుంజయ |
| దశనాడులు | యిడ | పింగళ | శుషుమ్న | గాంధారి | హస్తిని | పూషా | పయస్వని | ఆలంబన | కుహన | శంఖిని |
| దశరూపములు | తెలుపు | నలుపు | పసుపు | పచ్చ | ఎఱుపు | పొట్టి | పొడవు | సన్నగ | లావుగ | మిశ్రమముగా |
| దశనాదములు | జలధి | భేరి | క్షిణిక్షిణి | మృదంగ | ఘంటా | కహాళ | కింకిణి | వేణు | భ్రమర | ప్రణవ |

## షొడశాక్ష:

అస్యశ్రీషొడశాక్షరి మహామంత్రస్య । నిరంజన ఋషి: నిరహంకార: చంద:। నిరామయ నిరాకాశో దేవతా। నిరావరణ బీజం।నిస్త్రయ్ గుణ్యాశక్తి:। నిర్గుణప్రజ్ఞాన రహితం కీలకం। నిఖిల కాలేషుమాయా। సహిత భూతపంచక నిర్మిత దశేంద్రియ మనోబుద్ధి సహిత సూక్ష్మ శరీర రహిత సిద్ధ్యర్థం। షొడశాక్షరి మహామంత్రజపం కరిష్యే.

## అథహృదయాదిన్యాస :

నిర్మూలం - హృదయానమ:। ఏతత్ - సిరసేస్వాహ। జ్ఞానచ్ఛరీరం - శిఖాయైవషట్। నాస్తి - కవచాయహుం। కేవలం - హస్త్రాయఫట్ ॥

సమస్త నిర్మోహాయ త్రైకాలేషు మద్రహిత, నిశ్చయో భూర్భువస్సువరో మితిదశ దిగ్బంధ: ॥

## అథ: ధ్యాన్నము

శ్లో ॥ సర్వనిగమగుహ్యం। శాశ్వతం సర్వకాలం
సకల దివిజవంద్యం। సర్వ దిక్పూర్ణమచలం
సకల భయనివారణం। సర్వలోకాంతరస్థం
సకలముని హృదిస్థం। సర్వదేశప్రశస్థం ॥

శ్లో. నజ్ఞాతం పరవస్తురూపరహితం। నిస్తేజమమృతం పరానిశ్శబ్ధం నిరుపాసనం నిరుపమం। నిర్దేశపూర్ణ స్థితం। నిత్యాభ్యాస వివర్జితం విహితప। ద్వ్యాపారశూన్యం సదా ॥ నిస్సంగం నిరుపాదికం నిరవయం। నిత్యం హృదిబావయే.

శ్లో. ఆనందరహితోస్మి నిత్యమచలం। నిఆర్ఘత నిర్ఘోత నిరీంద్రియత్వం।
నిర్మోహ నిర్ద్వంద్వం నిరూప సత్యం। మహద్గురుం నిత్యమహం నమామి ॥

శ్లో. నిరాలంబాయ నిత్యాయ। నిర్మలాయ నిరంజన
నిత్యశుద్దాయ బుద్ధాయ। వస్తు మద్రహితం సమాప్తి

శ్లో. నిర్మూలమే తదాజ్ఞానా । చ్ఛరీరం నాస్తికేవలం
పాదశాక్షరితతసిద్ధ । మిదం వస్త్వనిశంభజే ॥

అర్థమను :

నిర్మూలమే తదా జ్ఞాన చ్ఛరీరం నాస్తికేవలం
మూలంలేని యీ గుర్తెరిగె శరీరం యేమి లేదు.

దృష్టద్రాష్టాంతం

శ్లో. స్వప్నే ప్రతీయ మానాని రూపానిద యతాతథా
కర్పూర దీప సంయోగం జ్యోతి రూపం యథాతథం

దృ. కలలో దోచిన శరీరములు యెలాగో అలాగే

ద్రా. కర్పూరము కళికి కూడితే ఎలాగో అలాగే

శ్లో. ఇతి మంత్ర సమానైన । సాందీప గుర్వగణి
కృష్ణస్యమస్తకే నస్య । హస్తం తూష్ణీం భూవహ

శ్రీ సద్గురు చరణార విందార్పణమస్తు

# తారకం

## షడ్చక్ర విచారణ

1. మూలాధార చక్రంబనగ గుధస్థానము. చతుర్ధళములు వ, శ, ష, స. అక్షరములు. గుధభాగము స్థానముగా గల్గి నాసికాధార భూతమై నా వళములతో కూడిన పద్మాకారముగా నున్నది. వరద, శ్రియ, షండా, సరస్వతి అనబడు నల్గురు దలాది శక్తులాదళములందు స్థితిగల్గి యుందురు. చతుష్కోణాకారము, పృధివి భూతము 'లం" బీజము సద్యోజాతముఖము, కుంకుమవర్ణము ఘ్రాణము కారణము క్రియాశక్తి గణపతి ఆదిదేవత (600). ఆరునూర్ల హంసల జపము.

ఉ. గం. 6 నుండి 40 నిమిషములు మాత్రమే యుండును. అంతలోపలనే ఆరునూర్ల హంసలు జపము చేయును.

2. మూలాధారమునకు రెండు అంగుళములపైన స్వాధిష్టాన చక్రము గుహ్యస్థానము. ఆరుదళములు. బ, భ, మ, య, ర, ల అక్షరములు. ఆరు వర్ణములతో ప్రకాశింపుచుంటవి. బందినీ, భద్రకాళి, మహామాయా, యశశ్వినీ, రమా, లంబోష్ఠి అనబడు ఆరుగురు దళాది దేవతాశక్తులా దళములందు స్థితి గల్గియుందురు.

అర్ధచంద్రాకారము, జలభూతములు "వం" బీజము వామదేవ ముఖము విద్యుత్ వర్ణము జంహ్వాకారణము. యిచ్ఛాశక్తి బ్రహ్మ ఆది దేవత (6000) ఆరువేల హంసల జపము (ఉ. గం. 6.41 నుండి మ. గం. 1.20 వరకు 6.40 ని)

3. స్వాదిష్టాన చక్రమునకు యెనిమిదంగుళములపైన మణిపూరక చక్రముండును. నాభిస్థానము పదిదళములు. డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ అనే పది అక్షరములు పదిమూల వర్ణాలుగా ప్రకాశింపు చుంటవి మరియు డామరి ఢంకారిణి - ణామరి - తామసి - స్థాన్వి - దాక్షాయణి - ధాత్రి - నందా - పార్వతి - ఫట్కారి యను దళాది శక్తులా పది దళములందు పరివేష్టించి యుండెదరు. దళములకు కర్ణికకు నడుమ రక్తవర్ణముగల అగ్నిమండలము ప్రకాశింపు చుండగలదు.

త్రికోణాకారము, అగ్నిభూతము "రం" బీజము అఘోరముఖము, శ్యామలవర్ణము నేత్రము కారణము జ్ఞానశక్తి, విష్ణు ఆదిదేవత ఆరువేల హంసల జపము (మధ్యాహ్నం గం. 1.21 నుండి రాత్రి గం. 8.00 వరకు స్వాదిష్ఠాన చక్రమందు 6000 వేల హంసలు జపము చేయుచుండును. అనగా మధ్యకాలము (గం. 6.40ని.)

4. మణిపూర చక్రమునకు పది అంగుళములపైన అనహత చక్రముండును. హృదయస్థానము పన్నెండు దళములు. క-ఖ-గ-ఘ-జ-చ-ఛ-జ-ఝ-ఞ-ట-ఠ అను లక్షరములు పన్నెండు వర్ణములు గలవు. కాళరాత్రి - ఖాతీత గాయత్రి - ఘంటాధారిణి - జెమిని - చండా - ఛాయా - ఝుంకారి - జ్ఞానరూపా - టంకహస్తా - ఠంకారిణీ యనబడు దళాది శక్తులా పన్నెండు ధలములందు పరివేష్ఠించి యుందురు. ఈ దళాదిశక్తులు సింధూర వర్ణము గలవారు.

షట్కోణాకారము వాయు భూతము "యం" బీజము తత్పురుషముఖము. త్వక్కు కారణము. బంగారు వర్ణము ఆది శక్తి రుద్రుడు ఆదిదేవత (6000) ఆరువేల హంసల జపము. (ఈ అనహత చక్రముపై రాత్రి గం. 8.01 ని. నుండి మధ్య రాత్రి గం. 2.40 నిమిషముల వరకు అనగా మధ్య కాలము గం. 6.40 ని.)

5. అనహతచక్రమునకు ఎనిమిదంగుళములపైన విశుద్ధ చక్రముండును. కంఠస్థానము. పదహారు దళములు అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఋ-ౠ-ఎ-ఐ-ఒ-ఔ-అం-అః అను అక్షరములు పదునారు మూల వర్ణములు (అచ్చులు) గలవు. అమృత ఆకర్షణి - ఇంద్రాణి - ఈశాని - ఉష - ఊర్ధ్వకేశి - ఋద్ధిద - ౠకార - కా - షా - ఏకపదా - ఐశ్వర్యా - ఓంకారి - ఔషధి - అంబికా - అక్షరా అనబడు దళాశక్తులా దళము లందు బరివేష్ఠించి యుందురు. ఈ దళములకు లోపలి భాగములన తెల్లని వర్ణము గలిగిన ఆకాశతత్వము వ్యాపించి యుండగలదు.

వర్తులాకారము ఆకాశభూతము '8అం" బీజము యీశాన్య ముఖము స్ఫటిక వర్ణము శోత్రకారణం పరాశక్తి ఈశ్వరుడు ఆదిదేవత (1000) వెయ్యి హంసల జపము.

(ఈ విశద్ధ చక్రముపై రాత్రి గం. 2.41 ని.ల నుండి తె. గం. 3.46 ని. వరకు వెయ్యి హంసల జపము జరుగును)

6. విశుద్ధ చక్రమునకు ఆరు అంగుళములపైన ఆగ్నేయ చక్రముండును. నేత్రస్థానము. రెండు దళములు. హం - క్షం అను అక్షరములు. కెంపు రంగు గల్గి ప్రకాశించు చుంటవి.

హంసవతి - క్షమా అనే దళాది శక్తులా రెండు దళములందు అదివసించి యుందురు. కర్ణికకు వెలుపలి ప్రక్కన గల త్రికోణాకారము నందు చక్రాది నాయకుడైన పరమాత్మ ప్రణవాకారముతో జ్యోతి స్వరూపియై వెలుగొందు చుండగలడు. ఈ త్రికోణాకార బిందువుతోటి మహాతత్వ భూతం "సం" బీజము అంతర్‌ముఖము మాణిక్య వర్ణము మనస్సు కారణము చిచ్ఛక్తి సదాశివుడు ఆదిదేవత. (1000) వెయ్యి హంసల జపము.

(ఈ ఆగ్నేయచక్రముపై రా. తె. గం. 3.47 ని. ల నుండి తె. గం. 4.53 వరకు వెయ్యి హంసలు జపము జరుగుచుండును) అనగా గం. 1.06 వరకు యుండును.

## సహస్రారము

సహస్రము అంటే పదివందలనే అర్థం మనకు స్ఫురిస్తుంది. కాని వేద పరిభాషలో సహస్రమంటే అనంతమనే అర్థం వుంది. శిరోమధ్య బాగమును బ్రహ్మరంధ్రమున మూల స్థానమందు సహస్రార పద్మముండును. వెయ్యిదళములు. ఓం అక్షరములు షట్‌కోణాకారము బిందువతోటి సాక్షిభూతము "ఓం'8 బీజము ఊర్ధ్వముఖము చిత్రవన్నె జ్ఞానము కారణము. సహజాత్మశక్తి గురుడు ఆదిదేవత (1000) వెయ్యి హంసల జపము.

(సహస్రారముపై తెల్లవారు జామున గం. 4.53 నుండి ఉ.గం. 6. ల వరకు అనగా.1.07 ని.ల వరకు యుండును. )

## ద్వాదశాక్షరి

అస్యశ్రీ ద్వాశాక్షరి మహా మంత్రస్య 1 అచల ఋషిహి అవి నాశచంద: అభవోదేవతా। అమృతబీజం। అప్రమేయాశక్తి :। అయమాత్మ తత్వము స్యాది జ్ఞాన రహిత కీలకం। అఖిల కాలేషు పరిపూర్ణమస్తి। మాయా సహిత మే తత్ప్రపంచం నాస్తీతినిశ్చయ సిద్ధ్యర్థం ద్వాదశాక్షరీ మహామంత్రజపం కరిష్యే ॥

## అథకరన్యాసం :

ఏతన్మిద్యా - అంగుష్ఠాభ్యానమ: । శుద్ధవియత్ - తర్జనీ భ్యాన్నమ । కించిన్నాస్తి - మద్యమాభ్యాంనమ: । ఏతన్మిద్యా - అనామి కాభ్యాంనమ: - శుద్ధవియత్ - కనిష్ఠకాభ్యాంనమ: కించిన్నాస్తి - కరతల పృష్టాభ్యాం నమ: ।

## అథఅంగన్యాస :

యేతన్మ్ధ్యా హృదయాయనమ: శుద్ధ వియత్ సిరసేస్వమా : కించిన్నాస్తి సికాయైవషట్ - యేతన్మ్ద్యా కవచాయహుం - శుద్ధవియత్ నేత్ర త్రయాయ వౌషత్ - కించన్నాస్తిహస్త్రాయఫట్ ద్రష్ట దరిశనదృశ్యాది సహిత - అహం పదార్థ రహిత - భూర్భువస్సు వరోవింతి దిగ్భంధ: ॥

## అథద్యాన్నం

శ్లో. అచలం చాధ్యం సర్వలోకే షుపూర్ణం - పర్వతీతం స్వానుభూతావగమ్యం - సార్వబాధ్యం సర్వకర్తుత్వ శూన్యం - పర్యావేద్యం సర్వరహితం నమామి ॥

శ్లో. ఆవాచ్యం హ్యఖండం హ్యలక్షం హ్యబాధ్యం - హ్యసంగం హ్యవేద్యం హ్యచింతం హ్యరూపం - హ్యసాద్యం హ్యనాద్యం హ్యతీతం - హ్యనంతం- హ్యశుద్ధం- హ్యబుద్ధం హ్యనామం నమామి ॥

శ్లో. మృత్యు జన్మభయదు:ఖవర్జితం - సర్వదృశ్య దృగ్ ద్రష్ఠ నాశనం అప్రర్క్యమమలం నిరామయం - అనుపమాన మచలం సమామ్యహం ॥

## అథమంత్రం

శ్లో. ఎత్ మిధ్యా శుద్ధవియత్ కించాన్నస్తితితే మయా
కృపయా పరమం ప్రొక్తం భజాగ్రేద్వాశాక్షరం॥

ఈ సహస్రారమునకు యెనిమిది రేకులు రే 1కి నూట ఇరువది యైదు దళములు యీ మొత్తం రేకులకు అష్టదళమని యీ మొత్తం దళములకు సహస్రారమని



అందురు. ఈ అష్టదళ మధ్య హంసదీపము రీతిగా వెలుగు చుండును. అట్టి హంసకు చలనము గలిగినప్పుడు

శ్లో. పూర్వదళేపుణ్యమతి ఆగ్నేయం నిద్రాలస్యం దక్షణే క్రూరం నైరుతే పాపం పశ్చిమ క్రీడాశక్తి వాయువేగమనం ఉత్తరేరతిప్రీతి యీశాన్యే ద్రవ్యదానం మద్యే వైరాగ్యే కేసరే జాగ్రత కర్ణికాయ స్వప్న లింగ సుషుప్తి పద్మత్యాగే తురీయం.

1. పూర్వ దళమున హంసయొక్క కళ సోకినప్పుడు పుణ్య విచారణ జేయుచుండును.
2. ఆగ్నేయం దళమున హంసయొక్క కలసోకినప్పుడు నిద్ర జెందును. ఆలస్యమొందును.
3. దక్షణ దళమున హంసయొక్క కళ సోకినప్పుడు చింతన జేయుచుండును.
4. నైరుతి దళమున హంసయొక్క కళ సోకినప్పుడు పాపచింతన జేయుచుండును.
5. పశ్చిమ దళమున హంసయొక్క కళ సోకినప్పుడు క్రీడ సల్పు చింతన జేయు చుండును.
6. వాయువు దళమున హంసయొక్క కళ సోకినప్పుడు గమనచింతన జేయు చుండును.
7. ఉత్తర దళమున హంసయొక్క కళ సోకినప్పుడు ఈతి సల్పు చింత జేయు చుండును.
8. ఈశాన్యదళమున హంసయొక్క కళసోకినప్పుడు దానచింతన జేయుచుండును.

కమల మధ్య భాగమున హంసయొక్క కళ సోకినప్పుడు వైరాగ్య చింతన జేయు చుండును. కేసరముల యందు హంస యొక్క కళ సోకినప్పుడు జాగ్రతావస్థ జెందును. కర్ణిక యందు హంసయొక్క కళ సోకినప్పుడు స్వప్నావస్థ జెందును. కమలము యొక్క లింగస్థానమున హంస యొక్క కళ సోకినప్పుడు సుషుప్తావస్థ జెందును. పద్మత్యాగమే తురీయావస్త జెందడము యిట్టి తురీయావస్థ యందు మనస్సు మగ్నత జెందడము వలనయోగులు అమనస్కయోగమని అన్నారు.

# మహావాక్యములు

1. అహంబ్రహ్మాస్మి 2. ప్రజ్ఞాన బ్రహ్మ 4. అయమాత్మబ్రహ్మ 4. తత్వమసి బ్రహ్మ

1. అహంబ్రహ్మాస్మి యనగా నేనే బ్రహ్మం బనుట

2. ప్రజ్ఞాన బ్రహ్మమనగా సర్వము మాయ దెలిసి మిగిలివినయే ప్రజ్ఞగలదో ఆ ప్రజ్ఞయే బ్రహ్మమగుట.

3. అయమాత్మ బ్రహమ్మమనగ ఈ జగత్తు నేను అప్రజ్ఞానము వేరులేక యేకమై యున్నదనుట.

4. తత్వమసియునగ "తత్" అనగా ఈశ్వరుడు "త్వం" జీవుడు యీ జీవేశ్వర అయిక్యమే అసిపదము.

ఈ బ్రహ్మమే సత్యస్వరూపమై జీవేశ్వర జగత్తు రూపమై సత్యజ్ఞానానంద స్వరూపమును దీనికే హిరణ్య గర్భుండని స్వయం భూయని సర్వసాక్షియని ఆపంజ్యోతియని త్రిమూర్త్యాత్మ స్వరూపుడని చెప్పబడును. దీనికే యెరుకయని పేరు. దీనినే సమస్తమైన పొరలు బ్రహ్మమన్నారు. దీనికే వేదములు ప్రమాణముగా నున్నవి.

సీ. శూన్య వాదుల కడు । శూన్యతత్వంబన
బ్రహ్మవేత్తలు పర । బ్రహ్మ మనగ
విజ్ఞానవంతులు । విజ్ఞాన మిదియన
బొరి సాంఖ్యయోగులు। పురుషుడనగ
నెసగు యోగీశ్వరు । లీశ్వరుడితడన
శైవమతాచారులు । శిడనంగ
కాలతత్వజ్ఞులు కాలరూపుండన
నాత్మార్గవిదులు చి । దాత్మయనగ

తే.గీ. తాదృశాత్మల వైరాగ్య । తత్వమనగ
మాద్యమికులెల్లనిదిమద్య । మంబనంగ
రమణ సమచిత్తులెల్లన । త్వంబనంగ
నఖిల సిద్ధాంత సమ్మతం । బగుచునమరు.

ఇది మాయగాని నిజమైన బ్రహ్మ గాదు. యిదే మూల మాయ దీనిని నమ్మిన వారికి బ్రమ విస్తారమే యిట్టి బ్రమను దీసివేయటమే జనన మరణ బ్రాంతి రహితము కావున యెరుకను విడే లక్షణము దెలియవలెను.

## పరిపూర్ణ బోధ

శ్లో. ఆత్మాతీతం కేవలాత్మ। దేహ। నాస్తికదాచన
ఆస్తి నాస్తితికోవేద। స్థియోనాస్తి సర్వదా ॥

అచల పరిపూర్ణ పరబ్రహ్మము అండపిండాండ బ్రహ్మాండముల యందు పైన మధ్యన క్రింద ముల్లు గ్రుచ్చ సందులేక నిండి నిబిడీ కీతంబైయున్నది. దేహాకారముల్ల గాక యింద్రియములు గాక నామరూప కుల గోత్ర వర్ణాశ్రమ ధర్మములు లేక స్త్రీ పురుష నపుంసక రూపములు గాక జనన మరణములు లేక సర్వకాల సార్వస్థల యందు చలించక శాశ్వతమై నిత్యమై సత్యమై యెరుక నెరుంగక తానే తానై కనుమూసిన కనుదెరచిన కనుమరుగింతైన లేక గానబడుచున్నది. అట్టి పరబ్రహమ్మమునందులే నెరుక మూలము లేకనే దోచి నేను జగత్తులై జాగ్రత స్వప్న సుషుప్తావస్థల జెందుచు భార్య పుత్రాది బంధుమిత్రులతోసర్వకర్మలను భవించుచు పాపపుణ్యంబులు జెందుచు యెనుబది నాల్గులక్షల జన్మంబు లెత్తుచు సకలావస్థలు జెందుచుండును. అట్టి యెరుకనే పెనుమాయ యనబడును. యీ పెనుమాయ పరిపూర్ణ పరబ్రహ్మమందున యే కాలమున లేనిది. అది యెట్లులనగా పారలరటి దుంపరీతి బట్ట ముల్లె రీతి రాళ్ళ గుట్టరీతి. తరువుల వనము రీతి తత్వముల యెరుక రీతి పారలరటి దుంపలే నట్టుగ. బట్టలముల్లెప్పనగ బట్టల ముల్లె విప్పి బట్టలు వేరువేరుగా తీసినచో ముల్లె లేనట్టుగ రాళ్ళ గుట్ట యనగా గుట్టయందున రాళ్లు వేరువేరుగా తీసినచో గుట్టలేనట్టుగ తరువుల వనమనగ చెట్లు వేరువేరుగా విభజించినచో వనము లేనట్లుగా ( యీ సర్వ బ్రహ్మాండమును విచారించినచో) తత్వముల యెరుకనగ యిరువైయైదు తత్వములు వేరువేరుగా విభజించనిచో యెరుకలేనట్టుగ యీ సర్వ బ్రహ్మాండమును విచారించినచో లేకపోవును. అట్లనే లేనెరుగతో పరిపూర్ణమును వూడజూచి లేనెరుకను యెరుక చింతనే తీసివేసిన చాలును. యిదియే పరిపూర్ణ బోధ యనబడును.